# తొలిపలుకు

శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు నాయందలి గురుభక్తితో నన్నెంతో గౌరవించుచు నీనడుమ "నేనింతవాఁడ నంతవాఁడ" నని స్వాతిశయముం దెలుపుచు గొన్ని వ్యాసములు వ్రాసినారు. ఆవ్రాఁతలకు నాకృతజ్ఞతన్ దెలుపుకొనుచుఁ జేతనైన ట్టీ చెకలాటము వ్రాయుటకుం గారణము కలిగినది. 'వారు నన్నుఁ దెలివితక్కువవాఁడని యేమో వ్రాయుచున్నాఁడు గాని విషయము తేలలేదనియు, కొండండీకొన్న తగురువలె జయము నాసించుచుండెననియు, లోనగు సంగతులు వ్రాసినారు. లోకప్రతారణము సేయుట నాచేతఁగాదు, నే నింతవాఁడ నంతవాఁడనని విఱ్ఱవీగను. వారు నన్నన్నమాటలకు సమాధానము వ్రాసితినిగాని జయమపేక్షించి కాదు. మునుమున్న వ్రాసినవారికి జయాపేక్ష యుండు నేమోకాని సమాధానము చెప్పుకొనువారి కుండఁబోదు. అయిన నిది యశ్వపతుల జయించుటయా? గజపతుల జయించుటయా? యీపుచ్చవ్రాఁతలలో జయమేమి? పరాజయమేమి? నేను జయమపేక్షించుట లేదు. ముమ్మాటికిని పరాజయమే యపేక్షించుచున్నాను.

నేనువ్రాసిన సమాధానవ్యాసములు 2, 3 పత్రికలలోఁ బడి యుండుటచేతఁ బాఠకుల సౌకర్యార్థము వానినన్నియు నొక్కచోఁ జేర్పనెంచి యిట్లు పుస్తకరూపముం గావించితి.

ఇందు వారు సూచించినవిధమున నేవిచెత్తవ్రాఁతలో కాలములు నిండించుటకుమాత్రమే పనికివచ్చునవి యేవో యట్టినా లోపములను దెలుప ననుగ్రహింతురుగాక యని పండితులం గోరుచు నిప్పటి కీప్రథమభాగము ప్రకటించితిని. ద్వితీయభాగము నచిరకాలములోనే పాఠక మహాశయులకు సమర్పింతునని విన్నవించుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.



# అంకితము

లోకమిత్రుఁడనైన నన్ను శత్రువుగా భావించి గర్హించుచు ననేకవ్యాసములు వ్రాసి "మ. ప్రకటింపంబడు మంచి చెడ్డయనుచున్ వాక్రుచ్చి చర్చింప" అనునట్లు నాకు మహోపకారము గావించుచున్న వారినెల్ల నాప్రాణబంధువులుగా నెంచి కృతజ్ఞతాపూర్వకముగా వారలకీగ్రంథ మంకితము గావించి సఫలీకరించుచున్నాను.

మ. నను నాకావ్యముల న్నిరంతరము చెంతఁజేర్చి చర్చించుచున్
మనమందెప్పుడు నిల్పుకొంచదరి సమ్మానించుచు న్నాదు పే
ర్మినిఁ బెంపొందఁగఁ జేయునట్లు సభలన్ రేపాడి మాపాడి చే
సిన మే లెంచుచు వారి కంకితముగాఁ జిత్రింతు నీగ్రంథమున్.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

ఓమ్.

# చెళ్లపిళ్లవారి చెఱలాటము

## ఉపోద్ఘాతము.

బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు, నిమ్మకునీరు పోసినట్లు నెమ్మదిగ కాలక్షేపము సేయుచున్న యిక్కాలములో సుమారు 3 సం॥రములక్రిందట హైదరాబాదులో నెవ్వరికో "వేంకటశాస్త్రిగారు కుమారసంభవము మొదలు మాఘమువఱకు నాయొద్దనే చదివినారు" అని నే వ్రాసిన జాబులోనిమాటం బురస్కరించుకొని "శ్రీపాదగురువుల కడ నాశుశ్రూష" అను పెద్దవ్యాసమును, మూడుసం॥రములకు మున్ను నేనువ్రాసి ప్రకటింపనున్న "శృంఖలము"లోని "ముక్త్యాలరాజాగారితో నేమో చెప్పి యేమో చేసినారు" అనుమాటలంబట్టి "నాముక్త్యాలప్రయాణము" అను పెద్దవ్యాసమును కృష్ణాపత్రికలో ప్రకటించినారు. ఆ వ్యాసములలో నన్నుగూర్చి యనేక నిందాగర్భ వాక్యములు, పరిహాసములు, దోషారోపణములు లోనగునవి పెచ్చుపెరిగియున్నవి. అవియన్నియు నేను గమనించి సమాధానము వ్రాయనెంచియు, కలహము పెంచుకొన్నట్లగునని 28-12-35 వ తేదీ కృష్ణాపత్రికలో హితబోధగా శాంతవ్యాస మొకటి వ్రాసి ప్రకటించితిని. అందు "మనము వృద్ధులమైతిమి, మనకిట్టివ్రాతలు వ్రాసికొనుట మంచిది కాదు, లోకము నవ్వుటకే. మనఃకలహములు పెంచుకొనుట మనయుభయులకును తగదు" అని లోనగుసంగతులు వ్రాసితిని. ఆ వ్రాతలు కూడ శాస్త్రిగారి కాగ్రహము కలిగించుటంజేసి 25-1-36 వ తేదీని "శాస్త్రిగారి క్షమాపణ" అనువ్యర్థిగల శీర్షికతో యిది "చంకదుడ్డు శరణార్థి" యనునట్టిదని చెలరేగి పెద్దవ్యాసము వ్రాసి, యందు నాచదువును గూర్చియు, నాకవిత్వమును గూర్చియు, మఱియు ననేకవిషయములంగూర్చియు గర్హించినారు. అది చదివినప్పుడు వారి చంకదుడ్డు నాబుఱ్ఱను పగులగొట్టక మానదని నిశ్చయించుకొంటిని. "జాత

స్యమరణం ధ్రువం" అని ధైర్యమవలంబించితిని. ఆవ్రాతలలో "వ్రాయవలసినసంగతులుంటే వ్రాసి లోకులను నొప్పించవలసిదనే నాప్రార్థనముమన్నాటికిన్నీ" అని వ్రాసి "తొక్కినాకరవదురాబుఱ్ఱతన్న" అనునట్లున్న నన్ను పురికొల్పినారు. ఇట్లు పురికొల్పుటంజేసియు సమాధానమీయదగినవిషయములకు నేను సమాధానమీయ కూరకున్న లోకము నన్ను గర్హించుననుభయముంజేసియు, సత్యాసత్యములు లోకమునకెఱింగించుట నావిధి యగుటంజేసియు, శాస్త్రిగారి వ్యాసములకు బదులు వ్రాయకున్నచో నా ముద్రించిన శృంఖలము తమకు భయపడి ముద్రింపలేదని శాస్త్రిగారన్నట్టిమాట దీనికిని వచ్చునని యభిప్రాయముం జేసియు నేనిపుడు సర్వవిధములచే నశక్తుడనయ్యును శాంతముగానున్న యీకాలమున మిత్రకలహము పెట్టుకొనుట కిష్టము లేకున్నను "తప్పనిసరి" యగుటంబట్టి యిట్లు వ్రాయవలసి వచ్చినందులకు విచారించుచు వారివ్రాతలలోనివిషయ మంతయు గోడీకరించి యీశ్వరముఖముం జూచుచు నిట్లు వ్రాయంగడంగితిని.

"మాఘము వఱకు" అని నేను వ్రాసినమూడేండ్లనాటిమాట కిప్పుడిట్టి వ్యాసములు వ్రాయుదురా? ఈ వ్రాతల కేదో పెద్దకారణముండి తీరవలయు నని నే నూహించి, దానిని వారే యెప్పుడో వెళ్ళబెట్టుదురనియే నిశ్చయించుకొంటిని. నిశ్చయించుకొనినట్లే చంకదుడ్డుశరణార్థి వ్యాసములో దాని నంతయు వెళ్ళగ్రక్కినారు. తమయొప్ప లేమి నంతయు చంకదుడ్డుశరణార్థియై నొక్కినొక్కి వెడలగ్రక్కినారు. ఇకమీద "నాపాలకొల్లు ప్రయాణము, నాయెక్కడికో ప్రయాణము" అను వ్యాసములు రానున్నవి. అవి యన్నియు కడపడ చర్చించి వ్రాయనెంచితి. నా వ్రాత యొప్పైనచో నన్ను భగవంతు డనుగ్రహించుగాక. తప్పైనచో దండించుగాక. లోకము సమబుద్ధితో విచారించుగాక !

శ్రీ

## మాపూర్వసంబంధము.

పాఠకమహాశయులారా ! నా కిప్పటికి 69 సం॥రములు నిండినవి. నే నెప్పుడును వేంకటశాస్త్రిగారు నాకు శిష్యులని యేసభయందును బలికియుండ లేదు. యేపత్రికయందును వ్రాసియుండలేదు. వేంకటశాస్త్రిగారు జగదతీతకవుల మైతివాను గరువంబున శ్రీచెర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు తప్ప నితరులు తమగురువులనుట తప్పుగా నెంచుచిత్తము గలవారు. పైకిమాత్రము వీరునాకు ఓనమాలుచెప్పిన గురువులు. వారు నాకు కాకాలు చెప్పిన గురువు లని పలుకుచుందురు. శ్రీశ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారి గురుత్వమున (వ్యాకరణపఠనమున) వీరి కంతగా గౌరవము రాలేదు. వీరు వ్యాకరణము భాష్యాంతము పాడినారేమో కాని యేసభయందు గాని వాక్యార్థము చేసి రాయడుశాస్త్రి ప్రభృతులవలె ప్రసిద్ధిగాంచలేదు నిశ్చయము. కవిత్వాదికముననే కొంత గౌరవము వచ్చినది. దాని కితరగురువులును, దైవమును కారణము. వీరు నన్ను గురువని చెప్పుదురు గాని నాకు మాత్ర మాయన శిష్యుడని చెప్పుకొనుటకిష్టము లేదు. వారి నుడియందు త్రికరణశుద్ధి లేదనితలంచుటయే దానికి కారణము. త్రికరణశుద్ధి లేదనుటకు వారి క్షమాపణ వ్యాసమే సాక్షియగుచున్నది. ఈయన నావిషయమై యనేకాపచారములు చేసి యున్నారు. నేను వాని నన్నింటిని సైచియుంటినిగాని ప్రతిక్రియకు దలంపలేదు. వీరునాపై వ్యాసములు వ్రాసినను బదులు వ్రాయుటకు నాకింతవరకు గలమాడలేదు. నాస్వభావ మొరుల దూషణాదికమును సైచునదికాదు. కావున్న నిట నిట్లగుటకు హేతువు పెద్దలూహింపకపోరు. కాలముగాని కాలమందిపుడిట్లుఅకారణముగా "గిల్లి ఖజ్జా తెచ్చునట్లు" నాపై వ్యాసములు వ్రాసినారు ఇంతవరకువచ్చిన పుడు నే నూరకుండుట తగదని నాకుగల పూర్ణాస్మృతితో యథార్థకథనము చేయుచున్నాను.

బందరువారు వేంకటశాస్త్రిగారిని గౌరవించు సందర్భమున నేనటకు సభాధిపతిగాఁ బోయినప్పుడు శాస్త్రిగారు నన్ను రహస్యముగా బిలిచి "ఈ సభలో మీరు నన్ను బహువచనముతో సంబోధింప వలదు. శిష్యుఁడని చెప్పవలెను" అనిచెప్పి సభలో "వీరు నా గురువు" లని చెప్పినారు. నేను వారుచెప్పినట్లు చేయక బహువచనమే ప్రయోగించి నా గురుత్వమును గూర్చికూడ కింవదంతి యంటిని. శిష్యుఁడని చెప్పుకొనుటకు నాకే సిగ్గు కలిగినది. లోకమునం దందఱకు నేనే శిష్యుఁడను. అందఱు నాకు గురువు లని నమస్కరింతును. నేను గొంచెము సంస్కృతాంధ్రసాహిత్యము, కొంచెము వ్యాకరణము, కొంచెము కవిత్వము, కొంచెము శ్రౌతము, కొంచెము స్మార్తము, కొంచెము వేదముం జదివినవాఁడనైనను నాకన్న వేయిమడంగు లెక్కువగాఁ జదివినవా రుందురు గావున వారికందరకు వందన సహస్రము లాచరింతును.

## పోరలు పుట్టుట.

పిఠాపురసంస్థానకవులలో నొకరగు వేంకటరామశాస్త్రిగారు మన వేంకటశాస్త్రిగారియొద్దఁ గొంచెము చదివియుండియు వీరిని గురువులని వారు వ్రాయలేదని వారిపై వీరికి నాగ్రహమువచ్చి కాఁబోలు నేమేమో వ్రాసినారు వారును "గురుఁడనంచు తగులుకొన్నాఁడు నిన్ను సైతానులాగు" అని వ్రాసి తాము వారి శిష్యులము గామని యేమేమో వ్రాసినారు. దాని కిది వ్యతిరేకము. నే నట్టితప్పు నెప్పుడును చేయలేదు. మన వేంకటశాస్త్రిగారితో గొప్పరపువారికిని రామకృష్ణకవులకును పెద్దపోరాటముపడి, పెద్దపెద్దవి భారతాలు గీరతాలు పుట్టినవి. ఆ సందర్భమున విషయము బాగుగా దెలియమింజేసి నన్ను వారు కోరినను నే నేపక్షమునుబూనక తాటస్థ్యమును వహించితిని.

అట్టికాలమున నొకనాఁడు వేంకటశాస్త్రిగారి శిష్యులట వేటూరిప్రభాకరశాస్త్రిగారు రాజమహేంద్రవరమునకు వచ్చి చింతామణీముద్రా



క్షురశాల సమీపమున నన్ను కలసికొని కొంత ప్రసంగించిన పిమ్మట కొన్ని కారణములు గలిగినవి గావున "వేంకటశాస్త్రిగారు నాయొద్ద మూడుమాసములు మాత్రమే చదివినారు అని పత్రికలలో వ్రాసి ప్రకటింపవలయునని తిరుపతి శాస్త్రిగారు కోరుచున్నారు" అని చెప్ప గా నేను "అట్లే వ్రాయుదును గాని యిట్లు తిరుపతిశాస్త్రిగారియొద్ద నుండి యొకజాబును తెండు, తెచ్చినచో వేంకటశాస్త్రిగారు నాయొద్ద చదువనే లేదు" అని వ్రాసి సంతకము చేసి యిత్తునని చెప్పితిని.

అంత ప్రభాకరశాస్త్రిగారు మారాడక వెడలిపోయినారు. తిరుపతి వేంకటేశ్వరులకు శిష్యులు మొదలగు వారెందరో తమ పక్షముగా వ్రాతలు వ్రాసినారు. నేనొకముక్కయైనను వ్రాయలేదని నాపై వారి కాగ్రహము కలిగినదేమోయని యూహించితిని. వేంకటరామకృష్ణ కవులు భారత మని వ్రాసి యందులోని కృష్ణపర్వములో నాకును వేం కటశాస్త్రిగారికిని గల సంబంధమును వ్రాసిరి. అది నేను వారికి చెప్పి వ్రాయించితి నని శాస్త్రిగా రూహించినట్లు లోగడ నేను తెలిసికొన లేదు గాని 9-11-35 వ తేది వ్యాసము 5 వ కాలములో వ్రాసిన వ్రా తలవలన తెలిసికొంటిని. రామకృష్ణకవులు భారతమును, వీరు గీరతమును వ్రాసికొని రని వినుటయే గాని నే నా రెండును చూచియుండ లేదు. సుమారు 2 సం॥ రముల క్రిందట భమిడిపాటి కామేశ్వరరావుగారు కృష్ణ పర్వప్రశంస తెచ్చి నా కా పద్యములు చదివి వినిపించినారు. గీరతము కూడ నెప్పుడో నాకంట బడినది. కాని దానిలో నే విషయమును జదు వలేదు. ఇదిగాక వారి గ్రంథము లేవియు నే నింతవరకు జదివియుండలేదు.

## కానీనశబ్దవిచారఘట్టము

రాజమహేంద్రవరములో రాజరాజనరేంద్రవర్ధంత్యుత్సవము జరిగి నప్పుడు శ్రీయుత కట్టమంచి రామలింగరెడ్డిగా రధ్యక్షులుగా వచ్చి భారత విమర్శనము చేయుచు నన్నయభట్టును పొగడి "యుద్ధమునకుం

బూర్వ్వమర్జునునిచే కర్ణుని 'కానీన' అని పలికించినారు, ఇది ప్రమాదమో, సంస్కర్తలదోషమో" యని పలికినారు. అంతలో వేంకటశాస్త్రిగారు లేచి యేమో మాటలాడుచు "ఇట్లు చెప్పుట తప్పుకాదు. 'కానీన' శబ్దము భారతిములో బహు స్థలముల నున్నది. కావున నిట నన్నయభట్టు తప్పు చేసెననుట తప్పు" అని వక్కాణించినారు. పిమ్మట నేను మాటలాడుచు "యుద్ధమునకుబూర్వ మర్జునునిచే నిట్లు పలికించుట సరికాదు. అప్పటికి కర్ణుడు కానీనుడని యార్గురికి మాత్రమే తెలియును. అర్జునాదులకు దెలిసినట్లు వ్యాసుడు వ్రాయలేదు. వారికి తెలిసిన యో యుద్ధమే లేకపోవును" అని చెప్పితిని. పిదపకొన్నినాళ్ళకు గానాల రామమూర్తిగారు నా కడకు వచ్చి యేతద్విషయ మంతయు నా వలనం దెలిసికొని న్యాయదీపికలో నొక వ్యాసము వ్రాసినారు. దానికి వేంకటశాస్త్రిగారు బదులు వ్యాస మొకటి వ్రాసి విస్సా అప్పారావుగారితో నా యొద్దకు వచ్చి వినిపించినారు. (అందునన్ను నిరసించుమాటలుకొన్ని గలవు) విని నేను శాస్త్రిగారిని లోపలికి బిలిచి "మీరీ వ్యాసము ప్రకటింపవలదు, మీపై వ్రాసిన యా వ్యాసము నేను వ్రాసినానని మీ యభిప్రాయముకానోపు యథార్థముగా నేను వ్రాయలేదు. అతడిట్లు వ్యాసమువ్రాయునని తెలియక సంగతులన్నియు నేనే యతనికిచెప్పితిని ఈ తప్పంతయు నాదిగానెంచి విరమింపుడు" అని ప్రార్థించితిని. సరేఅని చెప్పి దానిని కృష్ణాపత్రికలో ప్రకటించినారు. దానికి రామమూర్తిగారు బదులు వ్రాసినారు. అదియు నేనే వ్రాసితి ననియూహించిశాస్త్రిగారు 'జలతాడనము' (నీటిదెబ్బ) అనువ్యాసమును వ్రాసి యన్యాపదేశము గానన్నుదూషించినారు. దానికినే నేమియు బదులు వ్రాయక మదరాసు నుండి యొకకార్డుమీద "మీ జలతాడనము చూచితిని. చాలసంతసించితి" నని వ్రాసితిని.

## ముక్త్యాల ముచ్చట

అంతఁగొంతకాలమున కొక సందర్భమున మన శాస్త్రిగారుముక్త్యాల రాజావారి యొద్దకు వెళ్ళి "అంతేవాసిని నేను కృష్ణకవికి" ఇత్యాదులు పద్యములు చెప్పి రాజునకును నాకును గలిగియున్నపట్టుదలను పురస్కరించుకొని "మీరు ప్రత్యేకముగాఁ బిలిపించి కృష్ణమూర్తిశాస్త్రిగారితో మాటలాడవలదు. నేను వారికి చెప్పి యొప్పించి తీసుకొని వత్తును" అని చెప్పినారుగాని చెప్పినట్లు చేయలేదు. నేనెన్నిసార్లు వారియూరికివెళ్ళిముక్త్యాలకురమ్మనికోరినను వారు రాలేదు. నేనుమాత్రమే పోయి రాజుగారిని దర్శించినప్పుడు "వేంకటశాస్త్రిగారువచ్చినగాని మనవ్యవహారముకుదురదు, వారినితీసికొనిరండు" అనిచెప్పుచువచ్చినారు వీరురానేలేదు. "నాశరీరములో వ్యాధిగానున్నది. నేను రాలేను ఇదిగో కార్తికములో వెళ్ళుదము, చైత్రములో వెళ్ళుదము, మాఘములో వెళ్ళుదము" అని మొదలైనమాటలు చెప్పి కాలక్షేపముచేసినారు. ఈ లోగా మద్రాసు మొదలగుస్థలములకు వెళ్ళినారుగాని, ముక్త్యాలకు వచ్చుటకు మాత్రమే వ్యాధి బాధించినది. ఈసందర్భములో నాకొక సలహాయిచ్చుచు వచ్చినారు. ఏమనగా "మీరు పాలకొల్లువారికి కృతియిత్తుమని యగ్రిమెంటు వ్రాసియిచ్చియున్నారుగదా! దానిమాటయేమి? అది మొదట తొలగించుకొనవలెను దానివిషయమై నన్ను గూడ రమ్మన్న పాలకొల్లునకు వత్తును. వారి సంబంధమును వదలుకొన్న పిమ్మట నేను తప్పకుండ రాజుగారికొప్పఁ జెప్పి వ్యవహారము పరిష్కరింతును. ముందు చేయవలసినది పాలకొల్లు సంబంధము వదలుకొనుటయే" అని కొన్నిసారులుచెప్పినారు "మీరు చదరంగ మాడుచు భారతము వ్రాయుటలేదని రాజునకు కోపము వచ్చినది. ఇప్పుడు కూడనట్లే చేయుదురని సందేహించుచున్నారు. మాసవేతనముగాఁగాక మీకుపర్వమున కింత సొమ్మని యేర్పాటుచేయుదురు. మీ కేయేపర్వమున కెంతెంత కోరుదురో చెప్పుడు" అని కొన్ని

సార్లు చెప్పినారు. "మీరు రచించినభారతము పైభాగము నన్ను రచించుమని రాజుగారు కోరిరి. దానికి నేను మీయాజ్ఞ పుచ్చుకొని ప్రభాకరశాస్త్రిచేఁ గాని యవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిచేఁ గాని వ్రాయించి నేను సరి చూచుచుందు నని చెప్పితిని. మీ రాజ్ఞ యిత్తురా?" అని కొన్నిసార్లు చెప్పినారు. ఇట్లు చెప్పునప్పుడు నేను వారితో "మనము తృణజలూకన్యాయ మవలంబింప వలెనుగదా? రాజుగారియనుమతి వచ్చినప్పుడు పాలకొల్లు సంబంధము వదల్చుకొనవలెను గాని మును మున్న వారిని విడుచుకొని వీరితో వ్యవహారము కుదురనియప్పుడు రెంటికిం జెడిన రేవడులము కావలసివచ్చును. అట్లు చేయుట నాకిష్టము కాదు. మఱియు నాశ్వాసమున కింత యిత్తురని మీరు చెప్పినమాట గాని రాజుగారెప్పుడు నట్లు చెప్పియుండరు. అట్టినీచపుపని నేనెప్పుడును చేయను. మఱియు మీరుగాని మీశిష్యులు గాని భారతము వ్రాయు విషయములో నాయాజ్ఞతో నవసరములేదు. మీ యిష్టమువచ్చినట్లు వ్రాసికొనవచ్చును. వ్యాసులవారియాజ్ఞ గొని మీపుస్తకమునకు నా పేరు పెట్టక, మఱియొకపేరితో వ్రాసికొనిన నాప్రతిబంధమేమియునుండదు" ఇత్యాదులు చెప్పుచువచ్చినాను. తుద కేమియుఁ జేయలేదు గాని రాజుగారియొద్దనుండి వర్తమానము వచ్చినగాని నేను పాలకొల్లు వ్యవహారము మానుకో నని చెప్పుటచేత "సరే రాజుగారికి వ్రాసి తగినపెద్దమనుష్యునొకని రప్పించెద" అని చెప్పి కొన్నాళ్ళకు వేమూరి నారాయణరావుగారను నొకబ్రాహ్మణుని నాయింటికిఁ దీసికొనివచ్చి "వీరు ముక్త్యాలరాజావారి ప్రాణస్నేహితులు, లక్షాధికారులు, వ్యవహారదక్షులు, వీరు గీచినగీటు రాజుగారు దాటరు, వీరితో మీయభిప్రాయము వెల్లడింప వచ్చును, మీయందు వీరికి మిక్కిలి భక్తి" అని యెన్నోవారింగూర్చి చెప్పినారు. నేను రాజావారియొద్ద వారి నెప్పుడును జూడలేదు. వారెట్టి మిత్రులో నాకు దెలియదు వారెట్టివారో, యెవ్వరో

తెలియనివాడనై నను, మనశాస్త్రిగారి మాటలు విశ్వసించి వారితో నాయభిప్రాయ మంతయు విన్నవించినాడ. వారు "ఇదిగో యీదారినే ముక్త్యాలకు వెళ్ళి రాజాగారితో మనవిచేసి 4 దినములలోమిమ్ముఁ రప్పించెద. మీరు వేంకటశాస్త్రిగారితో కలిసి రావచ్చును" అని చెప్పి నా నమస్కృతులకు పాత్రులై వెడలిపోయినారు. నాల్గురోజులన్నది 4 నెలలైనది. వారును రాలేదు, వీరును రాలేదు, వర్తమానమును లేదు. (పైనుదాహరించిన నారాయణరావుగారు మాారాజుగారికి దాత్కాలిక పరిచితులు. ఏకారణముననో రాజుగారు దర్శనమునకు వెళ్ళగా రాజుగారు దర్శన మీయలేదని నాకు దెలిసినది.) ఇట్టివారితో నాకు సంబంధము కలిపి నా వ్యవహారము చక్కబెట్టెదనని శాస్త్రిగారు చెప్పినారు. పిమ్మట నేను శాస్త్రిగారితో "ఎవ్వరును రాయబారులక్కర లేదు. మీరును నేనును కలసి రాజుగారియొద్దకు వెళ్లుదము రండు" అని యెంతకాల మెన్నిసారులు కోరినను యేవోసాకులు చెప్పినారుగాని రాలేదు. కార్యము మఱియొక విధముగా జరిగిపోయినది.

పాలకొల్లు కృతి

పాలకొల్లులో భీష్మద్రోణ పర్వములు కృతియిచ్చు సందర్భమున మన శాస్త్రిగారిని నేనే రప్పించినాను. అపుడు నేను వీరితో "నేడు మీయుపన్యాసములో కృతిమహాత్మ్య మిట్టిది, కృతినొందినవారు ధన్యులు, పాలకొల్లు వైశ్యులం దీ కృతిపతులు గొప్పకార్యము చేసినారు" ఇత్యాదులు చెప్పుడని కోరితిని వారట్లు చెప్పక మఱియొక విధముగా జెప్పుచు నానారాజ సందర్శనము చెప్పినారు మఱియు నాపురిలోనొక సభలో నుపన్యాసము చేసి కపులంగూర్చి చెప్పుచు మొల్ల మొదలగు కవయిత్రుల పేరెత్తి "స్త్రీలు కవిత్వము చెప్పి యిట్టి గ్రంథములు చెప్పిరన్న నేను ప్పశ్నిసు. తంత్రుులో యున్నదమ్ములోరచించి ప్రియము నంజేసి వాండ్రపేరు పెట్టియుందురని నే తలంచెదను" అని చెప్పి యం

తలో నటనున్న నన్నుజూపి "మా గురువుగారి కౌమారతయం కవిత్వ
ము చెప్పను. కొన్ని గ్రంధములు వ్రాసినది" అని చెప్పిరి. లోకులప్పు
డేమియూహింతురో మా చదువరులే గ్రహింతురు గాక!

కొల్లాపురము గోల

మఱికొంత కాలమునకు కొల్లాపురములో ప్రభువుల వలన నాకు
రానున్న రెండువేలరూప్యములు వనం సీతారామశాస్త్రిగారనువారి
దుర్బోధమువలన రాకపోయినవి. దానిపై నాకింత కోపమువచ్చి సీతా
రామశాస్త్రిగారు ప్రభువులపై రచించినశ్లోకములు "శ్లోకపంచకనిరా
కరణ" మనుపేర విమర్శించి పుల్లెల శ్రీరామశాస్త్రిగారి పేర ప్రకటించి
తిని. సీతారామశాస్త్రిగారా నిరాకరణగ్రంథముం జూచి యీదేశము
నకు వచ్చి, వారిచేతను వీరిచేతను దమశ్లోకములు నిర్దుష్టము లనియు,
నిరాకరణగ్రంథము దుష్టమనియు నభిప్రాయములు పుచ్చుకొన్నారు.
నిరాకరణగ్రంథమును గర్హించుచు మనశాస్త్రిగారుగూడ నొకమహో
న్నతాభిప్రాయ మిచ్చినారు. తిరుపతిశాస్త్రిగారి కొడుకు చేత గూడ
యిప్పించినారు. నిరాకరణ గ్రంథము శ్రీరామశాస్త్రిగారిపేర నున్నను
విషయమంతయు నాదియే యనియు సీతారామశాస్త్రిగారివలన నాకు
2 వేలునష్టమువచ్చిన దనియు గ్రంథముఖమందలి మొదటిపంక్తులవలననే
తెలియుచుండును. అవ్వాత గూడ నాదియేయని వేంకటశాస్త్రిగారికి
తెలియకపోదు. ఇట్టివో నావ్రాతలలో తప్పు లున్నను తాము సమర్థిం
పపలయును గాని తిరస్కరించుచు కలహమాడినట్లు వ్రాయుట వీరికి
తగునా? వీరును, కొప్పరపు వారును కలహించునప్పుడు వారునాకెన్ని
యుత్తరములు వ్రాసి తమ వివాదసందర్భములో తమవాదమును సమ
ర్థించుచు నొకవ్యాసము వ్రాయవలయునని నన్ను కోరినారు. అప్పుడు
నేను కొప్పరపువారిది న్యాయవాదమైనను మన శతావధానిగారిని కా
దని ఖండించి వ్రాయుట సమంజసముకా దని వారికి జవాబువ్రాయ

లేదు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వీరిపై నేవో ఖండన గ్రంథము లు వ్రాసి యవి తెచ్చి నాకిచ్చి దీనిపై మంచియభిప్రాయమిమ్మని కోరినారు. అప్పుడు నేను సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో "మీరెక్కడ? వేంకటశాస్త్రిగారెక్కడ? మీరు వారిగ్రంథములపై ఖండనము వ్రాయుదురా? నేను దీని కంగీకరించి సమాధానమిత్తునా? చాలు చాలు వెళ్ళుడు" అని ప్రత్యాఖ్యానముచేసితిని. ఈ సంగతి మనశాస్త్రిగారెరుంగుదు రనుకొందును. మఱియు వీరితో కలహించిన మల్లాదిశాస్త్రిగారివిషయమై ప్రతికూలము లగుకొన్ని సంగతులు గలవు. ఇట్లు ప్రవర్తించునాపై వ్యతిరేకముగా నాకు పరమాపకారము చేసిన వనంవారిని సమర్థించుచు తా మన్యాయముగా నభిప్రాయమియ్యవచ్చునా? తా మిచ్చినయభిప్రాయము తప్పనియు, నాపైగల యసూయచేనట్లవిమర్శనగా నభిప్రాయమిచ్చి రనియు ముమ్మాటికిం జెప్పుచున్నాను. ఈవిషయ మన్వల విపులముగాచర్చించి వ్రాయుదును

తనపై నెప్పుడు నేవిషయమందు గలమెత్తి వ్రాయని నావిషయమున నిట్లు వ్రాయుట సమంజసమని పెద్దలూహింతురా? అంత నీ యభిప్రాయములను సేకరించుకొని సీతారామశాస్త్రిగా రొక ఖండనగ్రంథమొనగిచేతనో వ్రాయించి ముద్రించి ప్రకటించినారు. అందు వేంకటశాస్త్రిగారి యభిప్రాయము నాకంట బడినంతనే నేనునిర్విణ్ణుడ నయితిని ఔరా! కాలమెంతిచెడ్డది? యని విచారించి దానికి బదులు వ్రాయువాడనై కింకవీంద్రఘటాపంచానన ప్రభృతుల యభిప్రాయము లన్నియు ఖండించి వనంవారి ఖండనగ్రంథముపై మఱియొక ఖండనగ్రంథము వ్రాసి కాశీ, ప్రయాగ, కలకత్తా, నవద్వీపము, మైసూరు, చెన్నపట్టణము, తిరుపతి లోనగుచోట్లం గల మహామహుల యభిప్రాయముల నెల్ల సేకరించి నాలుగువందలపుటలుగల పెద్దగ్రంథము ముద్రించితిని గాని ప్రకటింపలేదు. అందొకప్రతియెట్లోమనశాస్త్రిగారికిదొరికినట్లునాకు దెలిసినది.

అంతలో కొల్లాపురపుదివానుగా రీసంగతి విని నన్ను పిలిపించి నాకు వాగ్దత్తమైన రెండువేలరూప్యము లిప్పించి యాఖండనగ్రంథము ప్రక టింపవలదనియు, దానివలన సీతారామశాస్త్రిగారి వృత్తికి భంగము కలు గు ననియు నెన్నో చెప్పి గ్రంథము ప్రకటింపకుండ చేసినారు. ఆ ప్రక టింపకుండుట తమకును బండితులకును భయంపడియని శాస్త్రిగారు తమ ముద్దుమాట లొలికించినారు.

బందరు సభా సందర్భము

మఱియు ననంతరకాలమున బందరులో నన్నుగూర్చియొక సభ జరి గినది. ఆ సభాసందర్భమున శిష్లా నరశింహాశాస్త్రిగారు నాభారతమును నిరసించినట్లు కృష్ణాపత్రిక వ్రాసియున్నది. దానిపై నేను నరసింహాశాస్త్రి గారి శిష్యులైన హరి నాగభూషణముగారియొద్దకు వెళ్ళి "మీగురువు గా రిట్లు చెప్పినారట నిజమెట్టిది" అనియడుగగా వారు "ఇదియంతి యు కృష్ణాపత్రికాధిపతి చేసినతప్పే గాని మాగురువుగారు చేసినతప్పు కాదు" అని చెప్పి తమగురువుగారుకు తాముకు దానికి బదులు వ్రా యుదుమని సెలవిచ్చి తుదకు చెప్పినట్లు జేయలేను. అంతలో గుడివాడ నుండి మన వేంకటశాస్త్రిగారు "కృష్ణాపత్రికలో నాపేరెత్తి మిమ్ముద్దే శించినవ్రాతలు (వేంకటశాస్త్రిగారిగురు వన్నగౌరవముతప్ప కృష్ణమూ ర్తి శాస్త్రిగారికి మఱి యేగౌరవమును లేదు) ఇత్యాదులు చూచినాను దానికి మీరేమియు వ్రాయవలదు. నేను సమాధానముల్ వ్రాయుదును" అని నాకు జాబు వ్రాసినారు. నెలపదిమైదురోజులు గడచినను వీరు చెప్పినట్లు చేయలేదు. అప్పుడునేను సమాధానము వ్రాసితిని. మన శాస్త్రిగా రిప్పటి వ్రాతలలో "నేను వ్రాయదలచినమాటలే కృష్ణ మూర్తి శాస్త్రిగారు వ్రాసినారు గనుక నేను వ్రాయలేదు" అని చెప్పా చున్నారు. ఇది సరియా? ఆమాటలే తాముకూడ వ్రాసిన నావాదన కుపబలము కాదా? దానంజేసి నాకు న్యూనత గలుగుటయే మాబాబు

గారికి సమ్మతమని సత్యము పొడకట్టినది. అటుపిమ్మట నాగభూషణము గారు చెప్పినట్లు శిష్టావారు చేయుదురేమో యని 3, 4, మాసములు వారివ్రాతలకు ప్రతీక్షించి ప్రతీక్షించి విఫలమనోరథుండనై యిది యంతయు నరసింహశాస్త్రిగారు చేసినదే యని నిశ్చయించుకొని పుల్లెల శ్రీరామశాస్త్రిగారిచే నొకవ్యాసము వ్రాయించితిని అది హరి నాగభూషణముగారి కాగ్రహకారణమైనది. వారు నన్నును నాభారతమును గర్హించుచు సుమారు 60 పుటలు గల వ్యాసమువ్రాసి నాకుబంపినారు. ఆంధ్రపత్రికలో ప్రకటించినారు దానిపై నాగభూషణముగారికి నేనొక బహిరంగలేఖ వ్రాసి ప్రకటించితిని. అది భూషణముగారు చిత్తగించి యేమేమో వ్రాసినారు. అంతలో పిలువనిపేరంటముగా మన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి కృష్ణాపత్రికలో శాంతివ్యాస మొకటి యచ్చొత్తించినారు. అది క్రింద కొఱవిబెట్టి నెత్తిపై నీళ్లు చిలకరించినట్లున్నది. అందు "మాగురువుగారి కేండ్లు గడచినను కోప ముడుగలేదు. నాగభూషణముగారిని బహిరంగలేఖలో తిట్టి దిగబారబోసినారు" అని వ్రాయుచు తుదకు నాకు శాంతులు బెట్టినారు. దానికిని నేను బదులు వ్రాయలేదు. గాని యన్నవరములో సమావేశమైనప్పుడు "నేను నాగభూషణముగారిని తిట్టితినంటిరి. ఆ శ్లేషయో చూపగలరా?" అని యడిగితిని. అడుగగా మనశాస్త్రిగారు "సంగీతవిద్యావిభూషణ హరి నాగభూషణముగారికి" యిది తిట్టుగాదా? అది వారికి లేని బిరుదము పరిహాసమును తిట్టే. "మీయాజ్ఞ శిరసావహించితిని" అని మీరు వ్రాయుట తిట్టువంటిది కాదా? ఆయన మీకు మిత్రుడు అట్టివానియెడ ఆజ్ఞ శిరసావహించుట అనుట తప్పుకాదా? ఇత్యాదులే పదుగురియెదుట నేను తిట్టినట్లని చెప్పినారు అప్పుడు గా దిప్పుడైన ఆ బహిరంగ లేఖలో నేను నాగభూషణముగారిని తిట్టితి నని యెవ్వరైన చూపి రూపింప గలిగినచో నే నెంతప్రాయశ్చిత్తమున కైన నర్హుడనే. అట్టిచో నాకుకోపము

మొండని, దొరలను దిట్టు స్వభావము గలవాఁడని, లోనగుసంగతు లు వ్రాయుచు మాగురువుగా రని పలుకుట, చివర శాంతులు పెట్టుట వగచి వాతలు పెట్టినట్లుగాదా? వారి సుస్వభావ మెట్లున్నదో నేఁడు వ్రాసిన శాస్త్రిగారి క్షమాపణ, చంకదుడ్డు శరణార్థి యను వ్యాసరాజము తెలియజెప్పుట లేదా? ఇత్యాదు లెన్నో యపచారములు వారు నాయెడల చేసినవియు చేయుచున్నవియుగలవు. గ్రంథవిస్తరభయంబున నావిషయ మింతటితో విడిచి ప్రస్తుతమునకు వచ్చుచున్నాను.

— శ్రీ పా ద గు రు వు ల క డ నా శు శ్రూ ష —

" శ్రీపాదకృష్ణ కవీంద్రుని కడ నైదుమాసముల్ శుశ్రూషచేసినాఁడ" అని గీరతములో వ్రాసితిమని యిట వ్రాసి కాటవరములో మేఘసందేశము మొదలు పెట్టి 29 శ్లోకములు మాత్రమే చదివినట్లు వ్రాసినారు 5 మాసములకు 29 శ్లోకములు మాత్రమే చదివితిమని తోచునట్లు చేసినారు. ఇట్టిచో " జాతకచర్యలో నిట్లు వ్రాసినాను చూడుడు. దిశంబరునెలచూడుడు, 4వ తేదీచూడుడు, 10వ తేదీ చూడుడు" అని వ్రాసి తాము వ్రాసిన వ్రాతలే ప్రమాణీకరించుట తాక్యసంప్రదాయముకాం బోలు! ఈవ్రాతలన్నియు నిరుపయోగములు, మఱియునీవ్యాసమున "నేను సర్వోత్తమహా సభలలో శిష్యుఁడనని డంకామీఁద దెబ్బకొట్టి చెప్పుచుంటిని. గ్రంథములలో వ్రాయుచుంటిని. కుమారసంభవ మేఘసందేశములు చదివిన నొకటియు మాఘము చదివిననొకటియునా?" అని వ్రాసిరి! దీనివలన వారి యంగీకార మెట్టిదో తెలియుచునేయున్నదిగదా! ఇట్టి స్థితిలో నేనెప్పుడో కారణాంతరమున తెలుపుడని కోరుటంజేసి హైదరాబాదులో నొకరికి వ్రాసినజాబులో "శ్రీచెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు కుమారసంభవము మొదలు మాఘమువఱకు నావద్ద జదివినా" రనిపడియున్నది. ఇట్లు నేను వ్రాసినమాటనిజమే. ఈవ్రాతవలన "కోపముతోపనీయలేదను కోవలెను" అని వారు వ్రాయుట యెట్టిదో తెలియదు. (అన

గా నోడలు తెలియక నేను వ్రాసితినని శాస్త్రిగారి యభిప్రాయముగదా!) కానింతు కోపము తోపనీయక నేనెట్టియ కార్యకరణముచేసి నానోవిచారింపుడు. "మాఘమువఱకు" అనునది అదిచిరకాలమునాటి విషయము గనుక నాకుఁగలిగిన విస్మృతియో? నాయజ్ఞానమో? నాయవివేకమో? అనుకొనవచ్చునుగదా! అయిన నీవిషయమెట్టిదియోయని నాలోనేను చర్చించికోఁగా వెంకటశాస్త్రిగారు నాయొద్ద సంవత్సరపరిమితకాలమునకు తక్కువగాకుండ నుండిరనియు, మాఘముకూడ ప్రారంభించి కొంచెము చదివిరనియు నాకు స్మరణకువచ్చినది. ఇట్లెప్పుడో అడవి శంకరరావు గారితో నేను చెప్పినట్లును దెలియవచ్చినది. అందుననే హైదరాబాదు వారికట్లు వ్రాసియుందును. 45సం॥ రములనాటి ముచ్చట గనుక నాది ప్రమాదమేమోయని తొల్లిశాస్త్రిగారు పేర్కొన్నవారినేగాక మరికొందరనెరిగిన వారిని విచారింపగా వారును నాకు దోచినట్లుగానే సాక్ష్యము చెప్పినారు. అయినను వారిదియు నాదియు ప్రమాదమేయనియు శాస్త్రిగారుజెప్పినదియే వేదమనియు వారు నాయొద్ద 29 శ్లోకములు మాత్రమే చదివితిమనివ్రాసినదియే నిజముకావచ్చుననియు నేనంగీకరించుచున్నాను. నేనట్లు ప్రమాదమున వ్రాసినను ఢంకామీఁదదెబ్బకొట్టి సభలలో చెప్పగలవానికి గ్రంథములలోవ్రాయగలవానికిఇదియొక తప్పుగాఁదోచునా? దీనికింతవ్యాసము వ్రాయునా? ఇందునతమకు గలిగిన పరువునష్టమేమి? తమచరిత్రలో రాగల కాలమువారు సందేహింతురని యిట్లు వ్రాయవలసివచ్చినదని యొక సాకు పన్నుచున్నారు. ఇట్టి హెచ్చుతగ్గులు తమవ్రాతలలో నెన్నియోయున్నవి. 5 నెలలని 3 నెలలనియిత్యాదులు. దానికి వీరు వ్యాఖ్యానములు చేసినారు. దీనికినట్లువ్యాఖ్యానమే చేయవచ్చును. ఇంతమాత్రమునకి పోయినదేమి యుండు? రాగల కాలము కొఱకే యిట్లుచేసితిమనునది నిజమైనచో అది యెవరికో నైజాములో వారికి వ్రాసిన జాబుగదా! ఆజాబు కృష్ణాపత్రికయా? ఆంధ్రపత్రికయా?

గురుదక్షిణయా! దీనివలన ఢంకామీఁద దెబ్బగొట్టి చెప్పుట యెట్టిదో పాఠకమహాశయు లూహింతురుగాక.

## —విజ్ఞాపనము—

వేంకటశాస్త్రి శతావధానిగారూ! మహాకవులని జగద్విఖ్యాతి గాంచిన మహామహులకు మీకు మాఘమువరకుఁ గావ్యములు చెప్పి నవాఁడనని యూరునుం బేరును లేని నేను అక్కడక్కడ చెప్పుకొని కాళిదాసుని తిలఘాతుక గురువువలె నాయహంభావమును వెల్లడించుకొను చు జీవనాధారము గలిగించుకొను చున్నానను కొనరాదా? ఇందు మీకు బోయిన దేమి? మీశతావధానిత్వమున కేమిభంగపాటు వాటిల్లును? మీ కింకవీంద్ర ఘటాపంచాన నత్వమున కేమి కించిత్వము గలుగును? మీలో కగురుత్వమున కేమిలఘుత్వము వచ్చును ఈమాత్రము నన్ను నగ్రహింప లేక యింతగా తెగవ్రాసితి రేమి? సామరస్యముతో నున్న యిక్కాలము లో నిప్పుడిట్లు వ్రాయుట కవసరమేమి వచ్చెను? ఆఁ! తెలిసినది. అవసర మే వచ్చినది. దాని నేనిట వ్యక్తీకరింపను. మీరే మీవ్యాసములలో నెటనైన వ్యక్తీకరింపక మానరు. మీ రెట్లు ప్రవర్తించుచున్నను అన్నెము పున్నెము నెఱుఁగని నేను మీయింటికివచ్చి మీతో సామరస్యము గ మా టలాడుచున్నానే: ఈనడుమ, నాజన్మ దినోత్సవ సమయమున మీకు జబ్బుచేసినదని డా॥ బెజవాడ వెంకటస్వామినాయుడుగారు చెప్పగా నుత్స వము నాఁపికడియమునకువచ్చి మిమ్ముచూచి మీ క్షేమసమాచారము తెలి యువరకు నాకేమియుతోపక మిమ్ము చూచివచ్చితినే! అక్కటక్కటా! మీ కపటనాటకమెరింగియు నెరుంగనివాడనైతిగదా! మీరుమీయ సంతు తంబైన చిత్తములో నిట్టి దురభిప్రాయము పెట్టికున్నవారుగనుక నేనాయెడ నిట్లు ప్రవర్తించు చున్నారు. నేనుమీయెడ నేయింత లవమైనగాని యుప చారము చేసియుంటినని రుజువు చేయఁ గలరా? మీరు చేసినవి వేనవేలు

అందు కొన్నిమాత్రి మీవ్యాసము మొదట సూచించియుంటిని. హైదరాబాదుజాబులోని "మాఘమువఱకు" అనునదితప్ప నేనుజేసిన యపచార మొక్కటి పేర్కొనుడు చూతము! "మాఘమువఱకు నా యొద్దనే చదివినారు" అని యేవకారార్థముతో హైదరాబాదువారి కుత్తరములో వ్రాసినందుకుమాత్రము క్షమింపుడని మిమ్ము వేడుచు నభివందన మాచరించుచున్నాను. ఇదియే నేఁ జేసిన తప్పు నన్ను క్షమింపుఁడు.

## —♦ నాసాక్ష్యమే గైకొనుడని ప్రార్థనము ♦—

ఎక్కడనో మీరు భారవిచదివినట్లు కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రి గారి సాక్ష్యమును నాశించుచున్నా నని వ్రాసితిరి. ఆ సాక్ష్యమేమి టికి? మీ రాశింపనేమిటికి? నాసాక్ష్యమే తీసికొనరాదా? మీరు బుద్ధి మదగ్రగణ్యులు, మీరు "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" అనునట్లు మీ పూర్వపుణ్యము మంచిదిగనుక మీ రొకరియొద్ద చదువకయే విద్యలన్నియు కరతలామలకంబువలెఁ గానవచ్చినవని చెప్పనొప్పదా? కవిత్వము నవధానము తమంత నవియే మీకుఁ బుట్టినట్లు సాహిత్యజ్ఞాన ముఁగూడఁ దానంత నదియే పుట్టినదని నేను సాక్ష్యము చెప్పుచు న్నాను. బందరులో మిమ్ము సత్కరించినసభలో వేయిమంది విను చుండ "వేంకటశాస్త్రిగారు నాయొద్ద జదివిరని పేరుగాని నేనేమియు వారికిఁ జెప్పలేదు. విద్యలన్నియుఁ దమంత నవియే వీరికి వచ్చినవి. ఇది వీరిపూర్వపుణ్యపరిపాక"మని చెప్పియుంటినే! దానినేల మీరు సాక్ష్యముగా తీసికొనరాదు? నే నేమో నావిశ్వకర్మ శిష్యునితో మీ విషయమై యపోహలు కల్పించి చెప్పినట్లును, అతఁడు హైదరా బాదులో నవి వెల్లడించినట్లును, దానితో లంక [illegible] మీరు వ్రాసినారు. నేను గల్పించిన యపోహలేమో? నా విశ్వకర్మ శిష్యుఁడు వెల్లడించిన వేమో? [illegible]. శేషవ్యాసములో వ్రాయుదురేమో చూచెదముగాక!

తోయిమ్మనవతప్పు. నిమ్మకు నీరుపోసినట్లు శాంతముగానున్న యీకా లమున నకారణముగ నీవ్యాసము వ్రాయుట పదియవతప్పు. ఇట్టి తప్పులన్నియు మీవియేకాని, నావియు నాశిష్యునివియుం గానేరవు. అని చెప్పకతప్పదు. ఇంతటినుండి మీరు సభలలో నట్లు చెప్పుకొనకుం డు. నేను కృష్ణమూర్తిశాస్త్రిగారిశిష్యుడను గానని చెప్పుడు. నే నిది వఱ కేసభయందును "వేంకటశాస్త్రిగారు నాకు శిష్యులు" అనిచెప్ప లేదు. ఏపత్రికయందును వ్రాయలేదు. ఇంతటినుండి నా మీ గురుత్వశిష్యత్వములు రద్దుచేసికొందము. కావలయునన్న "నేను వారికి శిష్యుడను, వారు నాకుగురువులు, వందనీయులు, వేదశాస్త్రా దులు చెప్పినారు" అని చెప్పుచుందును. పత్రికలలో వ్రాయుదును. ఇట్లు వ్రాసి ముఖపట్టము గట్టుకొమ్మన్న గట్టుకొందును. మీకడపటి వ్యాసములో ధవళేశ్వరములో మీరుచదువుచున్నప్పుడు నేను మిమ్ము వ్యాకరణము చెప్పుమని ప్రార్థించినట్లు వ్రాసినారు, ఇపుడట్లుగాక 'ప్రార్థించినారునాకు వచ్చిన అ-ఇ-ఉ-ణ్ లు చెప్పితి,నని వ్రాసియున్న చో నిపుడు నేం జెప్పికొను మీగురుత్వమునకు సాక్ష్యమై బాగుగా లగించి యుండునుగదా!

— ♦ దురూహాలు ♦ —

"దయమీఱ నైషధాంతము కావ్యములుచెప్పి" అనునది వ్రాసితిరి. ఇదికూడ నేను జెప్పినపద్యపాదమనియా? మీ వైరిశిష్యులు రామకృష్ణకవులు చెప్పినదియేమో? దానికేంగూడ నే కర్తనా? మఱి యు జగన్నాథస్వామిగారు వ్రాసినపద్యమునకుంగూడ నేనేబాధ్యు డనా? మీ వాదమునకు వ్యతిరేకమైన యాపద్య మేటికుదాహరించి నారో తెలియదు. లోకము నమ్మయుటకు మూకుడుగలదా? ఇది పుగాకృతమనుకొనవలసినదియేగాని యిపుడెవరినేమియన్న నేమిలాభ ము? అవధానిగారూ! మీకృతజ్ఞతాకృతఘ్నత లెవరికిం గావలయును?

మీరు నాకుశిష్యులనుటచేత వచ్చిపడెడు భాగ్యమేమి? గౌరవమేమి? పేరేమి? ప్రతిష్ఠయేమి? ఇట్టివ్రాతలు వ్రాయుట యేదో గొప్పలౌక్య మని మీ రూహించితిరిగాని యిప్పు డిట్లు వ్రాయుట నిగవసరము. నిరుపయోగము. మీరు గీరతద్వితీయభాగమున గురుదక్షిణపీఠికలో కొన్ని యంశములు విమర్శించినట్లును వానిని నేను ఖండించి వ్రాయుట మొదలగునవి చేయునట్లును వ్రాసినారు. 20 సం॥ లకుక్రిందట మీరువ్రాసిన యీవ్రాతలు అప్పటికిగా దిప్పటికిని నేను జూడలేదని భాసచేయుచున్నాను? "వేంకటరామశాస్త్రిగారో వారితమ్ముడో విని వ్రాసినవ్రాతమాత్ర మదిగాదనినాకు పూర్తిగ నమ్మకము" అని వ్రాసితిరి. అదియును నేను వ్రాసినదిగా నూహించినారా అభ్యూహించుట పాతకహేతువే "శాస్త్రులుగారు కొల్లాపురము వెళ్ళుటకు పూర్వము నా యందు మిక్కిలి యభిమానము గలవారనుటకు సందియము లేదు. వెళ్ళివచ్చిన కొలదిరోజులలో నాయందు మిక్కిలికోపము ద్భవించినది" అని వ్రాసితిరి. కోపముద్భవించి నేను మీ యెడలచేసిన యపచార మేమి? యెందువలన మీ రట్లు వ్రాయగలిగితిరో? నాకు ద్రోహము చేసిన వనంవారికవిత్వము నాక్షేపించుచు మేము వ్రాసిన నిరాకరణమును నిందించుచు వనంవారు వ్రాయించిన దోషాభాసనిరాసముపై మీ రొసంగిన మహాభిప్రాయమును విమర్శించి నేను శృంఖలములో వ్రాసి ప్రకటింపకుండుటయా మీ తలంచిన యపరాధము? దానిని నిరూ పింపవినగోరుచున్నాను. మీరాదియంతయు నూహాప్రసంగము. ఇత్యా దులు వట్టియనుమానములు పెట్టుకొని నావిషయములో మీరిట్లు ప్రవ ర్తించుట విజ్ఞానములోనిది కాదు. ఇంతకన్ని పాదిత్యము ను మరియొ కటి యుండదు. లంక యంటుకొన్నదని వ్రాసితిరికదా! మీ శేష వ్యాసముం దిలకించి చేతనైనచో దాని నార్పివచ్చెదను. లేదా దానిలో బడి చచ్చెదను. కానిండు కాగలకార్యమునకు దైవమే ప్రమాణము.

తోమ్మినవతప్పు. నిమ్మకు నీరుబోసినట్లు శాంతముగానున్న యికాల‌ములన నకారణముగ నీవ్యాసము వ్రాయుట పదియవతప్పు. ఇట్టి తప్పులన్నియు మీవియేకాని, నావియు నాశిష్యునివియుఁ గానేరవు. అని చెప్పకతప్పదు. ఇంతటినుండి మీరు సభలలో నట్లు చెప్పుకొనకుఁడు. నేను కృష్ణమూర్తిశాస్త్రిగారిశిష్యుడను గానని చెప్పుడు. నే నిది వఱకేసభయందును "వేంకటశాస్త్రిగారు నాకు శిష్యులు" అని చెప్ప లేదు. ఏపత్రికయందును వ్రాయలేదు. ఇంతటినుండి నా మీ గురుత్వశిష్యత్వములు రద్దుచేసికొందము. కావలయునన్న "నేను వారికి శిష్యుడను, వారు నాకుగురువులు, వందనీయులు, వేదశాస్త్రాదులు చెప్పినారు" అని చెప్పుచుందును. పత్రికలలో వ్రాయుదును. ఇట్లు వ్రాసి ముఖపట్టము గట్టుకొమ్మన్న గట్టుకొందును. మీకడపటి వ్యాసములో ధవళేశ్వరములో మీరుచదువుచున్నప్పుడు నేను మిమ్ము వ్యాకరణము చెప్పుమని ప్రార్థించినట్లు వ్రాసినారు, ఇవుడట్లుగాక 'ప్రార్థించినారునాకు వచ్చిన అ-ఇ-ఉ-ణ్‌లు చెప్పితి,'నని వ్రాసియున్నచో నిపుడు నేఁ జెప్పికొను మీగురుత్వమునకు సాక్ష్యమై బాగుగా లగించి యుండునుగదా!

— ♦ దురూహాలు ♦ —

"దయమీఱ నైషధాంతము కావ్యములుచెప్పి" అనునది వ్రాసితిరి. ఇదికూడ నేను జెప్పినపక్ష్యపాదమనియా? మీ వైరిశిష్యులు రామకృష్ణకవులు చెప్పినదియేమో? దానికిఁగూడ నే చేకర్తనా? మఱియు జగన్నాథస్వామిగారు వ్రాసినపద్యమునకుఁగూడ నేనేబాధ్యుడనా? మీ వాదమునకు వ్యతిరేకమైన యాపద్య మేటికుదాహరించినారో తెలియదు. లోకము నమ్మాయుటకు మూఁకుడుగలదా? ఇది పురాకృతముననుకొనవలసినదియేగాని యిపుడెవరి నేమియన్న నేమిలాభము? అవధానిగారూ! మీకృతజ్ఞతాకృతఘ్నత లెవరికిఁ గావలయును?

మీరు నాకుశిష్యులనుటచేత వచ్చెపడెడు భాగ్యమేమి? గౌరవమేమి? పేరేమి? ప్రతిష్ఠయేమి? ఇట్టివ్రాతలు వ్రాయుట యేదో గొప్పలౌక్య మని మీరూహించితిరిగాని యిప్పుడిట్లు వ్రాయుట నిరవసరము. నిరుపయోగము. మీరు గీరతద్వితీయభాగమున గురుదక్షిణపీఠికలో కొన్నియంశములు విమర్శించినట్లును వానిని నేను ఖండించివ్రాయుట మొదలగునవి చేయునట్లును వ్రాసినారు. 20 సం॥ రములకిందట మీరువ్రాసిన యావ్రాతలు అప్పుడుగా దిప్పటికిని నేను జూడలేదని బాసచేయుచున్నాను? "వేంకటరామశాస్త్రిగారో వారితరఫువారో విని వ్రాసినవ్రాతమాత్రమదిగాదనినాకు పూర్తిగ నమ్మకము" అని వ్రాసితిరి. అదియును నేను వ్రాసినదిగా నూహించినారా అట్లూహించుట పాతకహేతువే "శాస్త్రులుగారు కోల్లాపురము వెళ్ళుటకు పూర్వము నాయందు మిక్కిలి యభిమానము గలవారనుటను సందియములేదు. వెళ్ళివచ్చిన కొలదిరోజులలో నాయందు మిక్కిలికోపము ప్రభవించినది" అని వ్రాసితిరి. కోపముద్భవించి నేను మీయెడలచేసిన యపచార మేమి? యెందువలన మీ రట్లు వ్రాయగలిగితిరో? నాకు ద్రోహము చేసిన వనంవారికవిత్వము నాక్షేపించుచు మేమువ్రాసిన నిరాకరణమును నిందించుచు వనంవారు వ్రాయించిన దోషాభాసనిరాసముపై మీ రొసంగిన మహాభిప్రాయమును విమర్శించి నేను శృంఖలములో వ్రాసి ప్రకటింపకుండుటయా మీ తలంచిన యపరాధము? దానిని నిరూపింపవినగోరుచున్నాను. మీదియంతయు నూహాప్రసంగము. ఇత్యాదులు వట్టియనుమానములు పెట్టుకొని నావిషయములో నీరీట్లు ప్రవర్తించుట విజ్ఞానములోనిదికాదు. ఇంతకన్న పాండిత్యమును మరియొకటి యుండదు. లంక యంటుకొన్నదని వ్రాసితిరికదా! మీ శేష వ్యాసముం దిలకించి చేతనైనచో దాని నార్పివచ్చెదను. లేదా దానిలో బడి చచ్చెదను. కానిఁకు కాగలకార్యమునకు దైవమే ప్రమాణము.

—◆ దారుణాతి దారుణము ◆—

గతసంచికలో లంక యంటుకొన్నదనిరిగదా అమ్మయ్యో! లంక యంటుకొన్నది ఎంతభస్మీపటలమగునో ఏ బ్రహ్మాండము బద్దలగునో యని భయపడితిని గాని తుదకది తుస్సుమన్నది. వడ్లగింజలో బియ్యపుగింజకిందమారినది. దానికింతగింజులాటయేమిటికో? ఇదియే పనిలేనిపాటయనిపించును. యీపాటపై మాటలాడుట మంచిది కాదనుకొన్నను ఇది ద్వితీయం బుద్ధిలక్షణమని పెద్దలూహింతురు గాక.

"మాఘమువరకు" అను నా వ్రాత దారుణము; శృంఖలములో "చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు కొంతకాలము నాయొద్ద విద్యాభ్యాసము చేసినారని లోకమనుకొనుచున్నది. వీరు గీరతమను నొక మహాగ్రంథము రచించినారు అందు నొక్కచో నాయొద్ద చదివినట్లు వ్రాసినారు. నేనుమాత్ర మెటగాని యిది యిట్టిదని వ్రాసిగాని చెప్పిగాని యెఱుగను. నిశ్చయము. ఇందువలన నాకు రావు గౌరవములేదు" అనియున్న నా వ్రాత అంతకన్న దారుణము; అని శాస్త్రిగారు వ్రాసిరి. ఈ వ్రాత యెంతదారుణముగనున్నదో, ఎంతఘోరముగ నున్నదో, ఎంతకౄరముగనున్నదో, చదువరులే గ్రహింతురుగాక.

"హైదరాబాదువారికి ఆ యుత్తరము వ్రాయలేదేమో; అందలి మాటలు విశ్వబ్రహ్మ శిష్యునితో ప్రసంగింపలేదేమో యనుకొందమన్నను ఈ శృంఖలపీఠికలోనిమాటలు పైవానిని బలపరచుచున్నవి గదా!" అనిరి. ఏమిమాటలో! ఏమి బలపరచుచున్నవో! ఇవియే ప్రతారణవాక్యములు, ఇట్టివియే హెచ్చుతగ్గువ్రాతలు. అట్లు బలపరచుటచేత "వేంకటశాస్త్రి నాయొద్ద కుమారసంభవము మొదలు మాఘమువఱకు గాని లేక నైషధమువఱకుగాని చదివియుండి అవధానాభ్యాస మొనరించి కూడా యుండవచ్చునని యుందును" అని నేను

పలుచోట్ల ప్రసంగించి యుండవలెనని తేలుచున్నదట ! ఎట్లు తేలు చున్నదో, యెట్లు తులుగుచున్నదో, శతావధానిగారి బుద్ధికే పొడ కట్టునుగాని యితరులబుద్ధికి పొడకట్టదనుకొనియెదను. దీనికి గాడె జగన్నాథస్వామిగారి పద్యమొకటి యనుకూలించుటలేదట! 'నే నేపగి దిం గురుండనుడు నీకనికి' అని నే ననినట్లు పద్యము వ్రాసినారట ! మఱియు నేను స్వామిగారితో 'ఏదోకొంచెము నాయొద్ద చదివిన నది లెక్కలేదని ప్రసంగించి యుండవలె' నని మనయవధానిగారే వ్రాసి యున్నారు. నే నందఱియొద్దను 'నైషధాంతము నాయొద్ద చదివియుం డె' నని చెప్పినవాడ నైనచో స్వామిగారితోమాత్ర మట్లేల చెప్పియుం డనో! శాస్త్రిగారి పైవాక్యమునకును క్రిందివాక్యమునకు నెంత హెచ్చు తగ్గులు గలవో విచారింపుఁడు.

## కొంపతీతలు

"ఈ కొంపతీతవ్రాత శ్రీవారి కెందులకుదోచినదో" అనిరి. నావ్రాసిన కొంపతీతవ్రాత యేదియో ? 'మాఘమువఱకు' అను నా వ్రాతయే కొంపతీతవ్రాత. దీనింగూర్చి లోగడనే చెప్పియున్నాను. నేను హైదరాబాదువారికి వ్రాసినజాబులోని యీ ముక్కయే వారి కాగ్రహము గలిగించినదని వారివ్యాసము చదివినవారికి తెలియక పోదు. పైవాక్యము నేను దుష్టస్వభావముచేతను క్రోధముచేతను వ్రాసితి ననుకొనుడు. జగద్విఖ్యాతిం గాంచినవారి కందువలనవచ్చు నపకీర్తియేమి? 'కుమారసంభవమేఘసందేశములు చదివిననొకటియు మాఘమువఱకుఁ జదివిన నొకటియా?' అని వారు వ్రాసిన వాక్యమే పైవాక్యమును సమర్థింపదా? 'ఈషద్వైషమ్య మవివక్షితం' అని గాడె జగన్నాథస్వామిగారి నాలుగుమాసములకు వ్యాఖ్యానముచేసి సమర్థిం చినట్లు ఇటగూడ సమర్థింపరాదా? "అవధానకవిత్వములు నాయొద్దనే జరిగినవి" ఈ మాటలో నేనువారికి తాతా, తత యని పాఠమ్ముచెప్పితి

'నని యర్థముమాత్ర మున్నదా? జరిగినది — ప్రవర్తిల్లినది. అనగా నాయొద్దనున్న కాలములోనే తదభ్యాస మైనదని తేలుచున్నది. వారి వ్యాసములో మొదట 'వారియొద్ద నేను కవిత్వానికి సంబంధించినకృషి చేయలేదు' అనివ్రాసియు 'ఆయనఘుండు దీక్షితసమాహ్వయుండున్ .........నూత్నకవితాభ్యసనాదరు లౌట లక్షణం, బేయెడఁ జర్చ సేయునపు డీతఁడు తా నొక కొంతకొంత త, చ్ఛ్రియు గ్రహించె' అని పద్యమువ్రాసి వర్గయతివఱకు గ్రహించితి నని వ్రాసినారు. 'గురువు తత్సహపాఠియు...ఆడు చుందురు చదరంగ మట్టియెడల, లక్షణం బెట్టులట్లు తల్లక్షణంబు, నితఁడు గ్రహియించె' అనియు వ్రాసి నారు. ఈ మాటలయం దేది నిజమో చెప్పలేముగాని వారిపద్యములం బట్టియు, వర్గయతివఱకు ననుటంబట్టియు, కవితాలక్షణమేకాక చతురంగాద్యవధానలక్షణమును మాకడ గ్రహించినట్లు తేలినది. ఇట్లున్నచో 'కవిత్వము అవధానాభ్యాసము నాయొద్దనే జరిగినవి' అని నేనువ్రాయుట తప్పా? ఎవరియొద్ద నెవరు కవిత్వము చెప్పకొనుటయు నిట్టిదేకాని గుంటయోనామాలు వ్రాయించినట్లు వ్రాయింతురా; తనబుద్ధిబలముచేతనే గురూపదేశముంబొంది గ్రంథమును చూచి తల్లక్షణ మెఱింగి కవియగును. ఆల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారు "క్షానును కఖగఘుల్" అను నొకముక్క నాయొద్దఁ జదివినారు. అదియే యుపదేశమంత్రముగాఁ గొని కవిత్వ మెఱింగితిని. అట్లే యిట నను కొన్నను దప్పులేనేరదు. 'అప్పటికి వారికి కవిత్వముురాదు. అభ్యాసము చేయుచున్నారు. అవధానమప్పటికి నిప్పటికిని సందేహమే' అని తేల్చి వ్రాసిన వారివ్రాత సత్యదూరము. అప్పటికి నేను కొన్ని గ్రంథములు రచించియున్నవాఁడ నని చెప్పుచున్నాను. అవధాన మొనర్చుటను నొప్పుకొనదికాదు. 'చుట్టఁగాల్చుట పొడుముపీల్చుట చుట్టుపక్కలవారితో, నెట్టకేలకు మాటలాడుట యెట్టియేనియు

వెళ్ళినామని 5 మాసములనిరి. జ్యేష్ఠమునలో వచ్చినది శుక్లపక్షమో కృష్ణపక్షమో? కార్తీకమునలో వెళ్ళినది యేపక్షమో? వచ్చిన దేతిథి యో? పోయిన దేతిథియో? ఆనెలలో దినములు తగ్గినవో హెచ్చినవో వచ్చినవా డేగంటలో వచ్చినారో; వెళ్ళినవా డేగంటలో వెళ్ళినారో? ఈ కాలములో నా యొద్ద పుస్తకముపట్టి దినమునకు రెండుగడియల చొప్పున నెలకు 60 గడియలు—అనగా నొకదినము—ఈ లెక్క పరిహారము నాయొద్దఁ జదివినకాలము పై మాసములలో హెచ్చు తగ్గులు లేక సరియైనయెడల 5 దినములు మాత్రమే నాకడ జదివితిమని నిర్ణయించి వ్రాసిన నే నెంతయో సంతసింతును. ఇట్లు వారు పత్రికలలో ప్రకటించుటయే కాక కొన్నికోట్ల కరపత్రములు ముద్రించి లోకమున వెదఁజల్లుటయు, ఈ సభను తమయొద్దకు వచ్చి జోడు శాలువలు, ఒక చేతికఱ్ఱయును సమర్పించి విశ్వకర్మశిష్యుని బురస్కరించుకొని నాపై ద్వేషమువహించి నేఁ జేయనితప్పులంజెప్పి పుటికొల్పిన హైదరాబాదులోని వోగిరాల సుబ్బారావుగారికిం గొన్నిపుచ్చి వారి పునస్తాపోపశమనముం జేయుటయును వారి విధియై యున్నయది. మఱియు గండపెండేరమునాఁడు నను శాస్త్రిగా రన్నమాటలకు నో రెత్తలేకపోతినని హైదరాబాదువారు గర్హించినారు. అది నన్నుద్దేశించినసభ. అందొకని కాదని గందరగోళము పెంచుట కిష్టములేక దేనికిని నేను సమాధానము చెప్పలే దని నేను చెప్పితినని హైదరాబాదువారికి వ్రాసి వారికి సమాధానము గలిగింతురుగాక యని కోరుచున్నాను,

—♦ దుర్వాక్యములు ♦—

శిష్యత్వాగురుత్వములమాట కేమిగాని నే నపోహలు గల్పించితి ననియు, కోపము తోపనీయమి నట్లు వ్రాసితిననియు, కొంపతీతవ్రాతలు వ్రాసితి ననియు లోనగు వారివాక్యములు నామదికి నొప్పి గలి

సత్యమే కావచ్చునని చెప్పుచున్నాను. రాజుగారికిని నాకును మఱింత పొరలు పుట్టించునట్లు చెప్పినారని గాని, నావిషయము మటుకు జక్కగాఁ బ్రస్తావింపలేదని గాని నే నెందును వ్రాయలేదు. చెప్పలేను. కాని యేకారణము చేతనో సరిగ జెప్పలేను గాని రాజుగారికడ నా ప్రశంస వచ్చి యట్లు పద్యములు చెప్పి నన్ను భూషించినను నాక్షేపముగఁ దోపలేదు. రాజుగారికి నన్ను గూర్చియు నా ప్రవర్తనముఁ గూర్చియుఁ దెలియునే! అట్టి స్థితిలో వారు చేయు మహోత్సవములకు నా కాహ్వానము చేయకుండుటయు, నేను తన్మహామునకుఁ బోకుండుటయు నన్ను గూర్చి మఱియొకరు ప్రశంసించుటయు జరుగవలయునా? మొదలగు సంశయములచే కాబోలు నా కాపద్యములు హృద్యములుగ తోఁచకపోయి నవి. వారు ముక్త్యాలనుండి వచ్చునప్పుడు రాజమహేంద్రవరము రైలుస్టేషన్‌కడ మేము కలసినమాట నిజమే. ఆయన నాయుపటిసంగతులు చెప్పినదియు నిజమే: ఆపద్యములు విన్నపిదప నేను మహానందవారిధి మునిగి తేలి వారిని కౌఁగిలించుకొంటి ననుమాట నిజము కాదు. అపుడు నా కానందము గలుగలేదు. రాజుగారు నన్నిట్లు చేసిరిగదా యని కోపమేవచ్చినది. అపుడు కోపస్వభావముతో బిగ్గరగా నాయనిష్టమును వెల్లడించితిని. అపు డాయన నన్ను శాంతవచనంబుల వారించిరి. అదియంతయు బండిలోనివా రందఱు వినియున్నారు. "మహానంద వారిధి మునిగి కౌఁగిలించుకొంటిని" అనునది హెచ్చుతగ్గువ్రాఁత. పిమ్మట మేము కడియముస్టేషనులో దిగి వారి యింటికేగినపిదప వారిపొలమునకుఁ బోతిమి. అట వారి ప్రసంగము నాకు సరిపడినది కాదు. ఆవిషయ మంతయు నిందు లోగడ వివరించియే యుంటిని. ముక్త్యాలరాజాగారితో నేమో చెప్పి యున్నమాటకర్థము విచారింపగా విశ్వకర్ణిశిష్యునిమాటలు దానికి వ్యాఖ్యానముగా నున్నవట! హైదరాబాదువాంజాబులో రాజాగారితో కృష్ణమూర్తి

శాస్త్రిగారు దుర్మార్గులని వేంకటశాస్త్రిగారు రాజాగారిచ్చు... నాపుచేయించి, గురువులందు కృతఘ్నతను చూపియుండి ... మొదలగు సంగతులు నావిశ్వకర్మశిష్యుఁడు చెప్పినట్లున్నదట. ఈ చెప్పుటచేత 'ఏమో చెప్పి యేమోచేసినారు' అనుమాత్రము... కిది భాష్యమగుటకు సందేహము లేదు అని వ్రాసినారు

— నిందాగర్భము —

ఇట్లు నే నెవ్వరితోడను జెప్పలేదు. విశ్వకర్మశిష్యు ... చెప్పి నాఁడో నాకు దెలియదు గాని నే నీవ్యాసములో మొదటవా... సంగ తులు విని యట్లు చెప్పియుండెనేమో యని సందేహించి యతని బిలిచి నీ వేమి చెప్పితి వని యడుగగా నతఁడు "హైదరాబాదులో ... సుబ్బారావుగారితో నేను ప్రసంగించినప్పుడు నేను కృష్ణశాస్త్రిగారి శిష్యుఁడ నని చెప్పితిని. అప్పుడు సుబ్బారావుగారు '... గారు వేంకటశాస్త్రిగారి శిష్యులటకాదా!' అనిరి. 'కాదు వేంకటశాస్త్రి గారే మా గురువుగారి శిష్యులని చెప్పి లోఁగడ శాస్త్రిగారు చెప్పిన 'అంతేవాసిని' అనుపద్యము చదివి వినిపించితిని, అని చెప్పి... (ఈ విషయమంతయు నతఁడు లోకమునకు దెలియునట్లు వివరముగా వ్రాసి పత్రికలలో ప్రకటించి యున్నాఁడు చిత్తగింపుడు) ... విషయములో నెవరో యెవరితోడనో యేమో చెప్పగా వారు వ్రాసిన యుత్తరములోని కూటవాక్యములు నమ్మి న న్నిట్లు చెండను... శాస్త్రిగారికి తగదనుకొందును. చూడు డెట్లు వ్రాసినారో ... ధానిగారు — "నేను కృతఘ్నత్వాన్ని గూర్చి విస్తారంగా పెను... పుస్తకాలు వ్రాసి జీవితంలో చాలభాగము దానికోసమే వినియోగిం చినవాణ్ణనడంచేత "తప్పులెన్నువారు తమతప్పులెఱుగరు" అన్న వేమ న్నగారిసూక్తిని నాయందు పట్టించడం సుళువు గనుక ఈ తోవను గురువుగారు తొక్కేరనుకో వలెనా!' అని వ్రాసినారు. దీనిలోని

తాత్పర్యము 'తప్పులెన్నువారు' అనుపద్యమువలన విచారించిన వారికి సుగమము. ఇది యన్యాపదేశముగా నన్ను దూషించుట యని నేను చెప్పనక్కరలేదు. దుర్మార్గులని, కృతఘ్నులని, మాసవేతనము పడగొట్టినారని నేననుట నిజమైనయెడల వా రెట్లు వ్రాసినను వ్రాయవచ్చును. నేను నాశిష్యునితో నేమి చెప్పినానో; అతడా సుబ్బారావుగారితో నేమి చెప్పినాడో; వారేమివ్రాసినారో! ఇందలి సత్యాసత్యములు విచారించి నిశ్చయించుకొనిగదా వ్రాయవలసినది! అట్లుగాక ఇట్లువ్రాయుట దుర్మార్గలక్షణమని నే ననక తప్పదు. ఇం దెవరియందు దోషమున్న వారే యనుభవింతురుగాక! నేను వేంకటశాస్త్రిగారివిషయమై వ్రాసినవ్రాతలు శాస్త్రిగారు చెప్పగా విన్నవియును, కన్నవియును మాత్రమే. యూహాలం బట్టియు,పరులమాటలంబట్టియు వ్రాయలేదు, వ్రాయను. సందేహములకు వ్యాఖ్యానములుచేసి గర్హింపను. నిశ్చయము.

— ఏమోచెప్యాదుల చర్చ —

"శ్రీముక్త్యాలరాజాగారితో నావిషయ మేమో చెప్పి యేమో చేసినారు, పాలకొల్లువారితో నాకుగల భారతసంబంధము తెప్పించుకోవలయు నని నా కెంతో ప్రోత్సాహము చేసినారు" అని నీవు వ్రాసితివి, దీని కేమిసమాధానము చెప్పెద వనినచో చిత్తగింపుడు. మాబాలసరస్వతిగారు ముక్త్యాలకు వెళ్ళినప్పుడు నావిషయమై రాజాగారితో 'నేను కృష్ణమూర్తిశాస్త్రిగారితో చెప్పి యొప్పించి తీసికొనివత్తును' అని లోనగునవి చెప్పినారు. చెప్పినట్లు చేయలేదు. ఇది యేమో చెప్పి యేమో చేయుట యని నా యభిప్రాయము. 'పాలకొల్లువారికి వ్రాసియిచ్చిన ఎగ్రిమెంటు రద్దుచేసుకోవలెను' అని చెప్పిరి. ఇది ప్రోత్సహించుట కాదా! ఈమాటలు సత్యములు కావని శాస్త్రిగారు చెప్పగలరా! మరియు నేను వారి విషయమై వ్రాసినవ్రాతలం గూర్చి

ఏదియేని యు వారు కాదనగలిగినచో నొరులసాక్ష్యముతో నవసరము లేకుండ నేను చేసినది తప్పేయని యొప్పుకొందును.

—♦ మోసగింత ♦—

"రామాయణములో పిడికెళ్ళ ప్రేటులాట" యనునట్లు ఈ సందర్భమున నసందర్భముగా మఱికొన్ని విషయములు వ్రాసినారు. వానికి సమాధానము చెప్పుటకన్న చదువరులకే తద్విషయము విడిచి పెట్టుచున్నాను. కాని ఒకసంగతిమాత్రము చెప్పుచున్నాను. చిలకమర్తి వారికి వ్యతిరేకముగా కాశీభట్టబ్రహ్మయ్యశాస్త్రిగారి యాధిపత్యమున చేసిన సభలో మన బాలసరస్వతిగారు తాము చేసిన చర్యయంతయు మంచిదని కాబోలు నిట నేకరువు బెట్టినారు. ఇది యంతయు తప్పనియు, తాము చేసినది ద్రోహమనియు చెప్పుచున్నాను. చిలకమర్తి వారియందు తమ కిష్టమున్నచో మొదటనే "నే నీ విషయములో ప్రసంగింపను. న న్నుపన్యాసకునిగా కోరవలదు' అని చెప్పి మానుకొనవచ్చును. అట్లు చేయక అనుకూలముగా మాటలాడుదు మని చెప్పి ప్రతికూలముగా మాటలాడుట ద్రోహమని పెద్దలూహింపరా? నే నొక విధముగా చెప్పి మఱియొక విధముగా చేసినానని చెప్పుకొనుటచేతనే తమ తెలివితక్కువ తెల్లమగుచున్నది. ముక్త్యాల ప్రయాణములో వనంవారి సంగతి తెచ్చుట ప్రస్తుతముకాదు. "యేమో చెప్పి యేమో చేసినారు' అను నొకముక్కయే తమకు కావలసినది. అట్లు చేయక వనంవారి విషయ మెత్తినారు. గనుక నేను దానికి సమాధానము వ్రాయవలసి వచ్చినది. వనంవారి శ్లోకపంచకముపై నిరాకరణము నేనే వ్రాసితినని మనశాస్త్రిగారికి తెలిసినట్లు 'శ్లోకపంచకము నాక్షేపించి ఏకర్మమూ నెఱుగని పుల్లెల శ్రీరామశాస్త్రిగారిపేరున ప్రకటించిరి' అని వ్రాయుటచేత, స్పష్టమగుచున్నది. కాని తరువాత వ్రాతలలో తా మభిప్రాయమిచ్చున కొన్నినాళ్ళకు శ్రీరామశాస్త్రి

గారిలో ప్రసంగించినపుడు నేను వ్రాసినదని తెలియక యభిప్రాయ మిచ్చితిరనియు, నిరాకరణము నా పేరున లేదనియు, తేకున్నను ఇది గురు గారిదే యను ననుమానము నాకు లేకపోలేదు అనియు, పేరు లేని రణమున దానిపై తా మభిప్రాయ మిచ్చినట్లును చెప్పు చున్నారు. అది సరికాదు. అది నేను వ్రాసినదని పరిపూర్తిగ వారికి తెలియును. శ్రీరామశాస్త్రిగారికిని కొల్లాపురం వారికిని సంబంధము లేదు. అందలి విషయ మంతయు నన్ను పురస్కరించుకొని యున్న ట్లును నాకు రెండువేలరూప్యములు వనంవారివలన రాకపోయినట్లును స్పష్టముగ మొదటిపత్రమే తెలుపుచుండినది. అందు మొదటిపంక్తి లోనే నా పే రున్నది. అభిప్రాయ మిచ్చువారు గ్రంథ మంతయుం జదివి విషయము తెలిసి తమ యభిప్రాయము వ్రాసియిత్తురు. అట్టి నా మొదటి పత్రములో మొదటి పంక్తియైన చూడకుందురా? విష యము తెలిసికొనకుందురా! తెలియక తను యభిప్రాయ మిచ్చినా మని వ్రాయుట సత్యదూరము. మా యిరువురకున్న సంబంధముచే నా వ్రాతలలో తప్పులున్నను సమర్థించి వ్రాయుట తమకు విధియై యుండ, నొప్పులనే తప్పులని, నిరాకరణ గ్రంథము నింద్యమని, అవి పాపవ్రాతలని, మానవమాత్రుఁ డెవ్వఁడు నట్లు వ్రాయఁడని నన్ను దూషించి, వనం వారిని భూషించుట తగునో తగదో నేనుచెప్పకుండ చదువరులే గ్రహింతురు.

తే॥ "ఒప్పులను గూడ తప్పులం చోలి వ్రాసి
పైని పడదిట్టినట్టి యద్దానిమీద......

క॥ "వారలలో నే నొకరుడ
నే రము నామీద లేమి నిక్కము యేనిన్
ప్రారంభ మయ్యె కోపం
బారక నామీద గురుని కోరిక లేమిన్."

అని జాతకచర్యలోని శాస్త్రిగారి వ్రాత లివి. నిరాకరణ గ్రంథమందు ఒప్పులను తప్పులని నేను పడదిట్టినట్లును, తాము సరి యైనయభిప్రాయమిచ్చినట్లును, నా కోరిమి లేనట్లును వ్రాసినారు. నే నభిప్రాయమిచ్చినవారి నందఱను తూరుపారఁబట్టి తిట్టిన ట్లొక లేత మాట పలికినారు. శృంఖలము ప్రకటింపఁబడినచో, వారిమాట లెంతసత్యములో చదువరులకు తెలియకపోదు. నిరాకరణగ్రంథమును నిరసించుచు వనంవారు వ్రాసిన ''దోషాభాసనిరాస'' మనునది సరి కాదని దానిపై "దురుద్ధరదోషశృంఖలము" అను గ్రంథము వ్రాయ నెంచిన నేను దానిపై యభిప్రాయము లిచ్చినవారి వ్రాతలను ఖండించి వ్రాయకున్న నా వ్రాత యెట్లు సమర్థమగునో విమర్శకులకు విశదము. ఆ పండితులను తిట్టితినని శాస్త్రిగా రనుచున్నారు. అం దెట్టితిట్లున్నవో, ఎట్లున్నదో తెలియుట కది ప్రకటించుటకు ముందు వనంవారి శ్లోకపంచకములో నేను చూపినదోషములును పండితుల యభిప్రాయములు నిట వ్రాయుచున్నాను. చిత్తగింపుఁడు.

## శ్లోక పంచక నిరాకరణము.



"కాలీన" ఇట్లు తార్కికులు వాడుచున్నారు. పాణినిమతమున నింద్యము "కాలిక" అని యుండనగు. అని హెడ్డింగులోని దోషము.

"(1) శ్లో. శ్రీకృష్ణం పురతో విలోకితు మనీశాం రుక్మిణీం లజ్జయా
వ్యానమ్రాబ్జముఖీం నిజోరసి ముదా సంవీక్ష్య హృష్టాం ప్రియాం
సాకూతప్రణయం సమీక్ష్య తయితాం దత్తాదృశీ మేతయోః
కృష్ణో హృష్టతనుశ్చిరాయుకరుతాం సౌభాగ్యమాయుశ్శ్రియం."

ఇది గంపతిరుగుడన్వయము. అనీశాం—అనుచో యతిభంగము, మగఁడు లేనిది అని యశ్లీలము. వ్యానమ్రాబ్జముఖీం=వి శేష

ముగ నంతటను వంగిన యబ్జమువంటి ముఖముగలది; ముఖము బాగుగా క్రిందికి వంగినప్పుడు నిజవక్షోమణియందు నిజరూపమే గాన వచ్చును.. కృష్ణరూపము ప్రతిబింబించుట అసంభవము; ఇందు సంవీక్ష్య, సమీక్ష్య అని రెండుమారులు ప్రయోగించుట సరిగాదు. "దయితాం, ప్రియాం" సమానార్థకములు; తత్తాదృశీం=అనునది నిరర్థకము; శ్రీకృష్ణ కృష్ణశబ్దములు రెండుమాఱులు వ్రాయుట సుకవిత్వముకాదు. ఆయుర్లక్ష్మీసౌభాగ్యరూపఫలము వధూవరగతమగుచుండ "కురుతాం" అని యాత్మనేపదము ప్రయోగించుట తప్పు. వధూవరనామనిర్దేశము లేనప్పుడు మొదటిపద్యంలోనే "ఏతయోః" అని ప్రయోగించుట యశాబ్దజనకము.

"(2) శ్లో॥ కల్యాణం శివయో రపాంగసరణిః కుర్యాద్వివాహోత్సవే
లజ్జాప్రేమతరంగితేక్షణశతై రన్యోన్య మాలోకతోః
సౌభాగ్యం సకలం మనోరథశతై స్సంపూర్ణతా మిందిరా
దేవీ వేంకటశబ్దపూర్వకజగన్నాథాఖ్యభూపాలయోః"

ఇందు "లజ్జాప్రేమలచే సంజాతతరంగము లగుచూపుల శతములచే నొకరినొకరు చూచుకొనుచున్న శివులయొక్క కేగంటిచూపుల పంక్తి కళ్యాణములఁ జేయుఁగాక" అనువాక్యమున కర్మభూతమగు కళ్యాణశబ్దము క్రియాన్వయముచే శాంతాకాంక్షమై యుండ తృతీయపాదస్థ మగుసౌభాగ్యమనోరథశతపూర్ణత్వపదార్థముల నభేదముగ నన్వయించుటకై మొదటివాక్యమందలి కళ్యాణపదము నాకర్షింపవలసివచ్చుటచే సమాప్తపునరాఖ్యానదోషము పట్టినది. సౌభాగ్యమునకు సకలమను విశేషణము వ్యర్థము; కోరికల నూర్లచే సంపూర్ణతం గోరుటచే నెల్లపుడు వీరికి వందలకొలఁది కోరిక లుదయించుగాక యని తేలినదిగాని, తత్సిద్ధి తేలలేదు; 'ఆలోకతోః' లోకృధాతు వాత్మనే పదము, గావున ఆలోకమానయోః, అని యుండఁదగు, చ్యుతసంస్కారదోషము;

(౩) శ్లో. వీణాగానవినోదలోలహృదయాం విద్యావినోదప్రియాం
సామాదిశ్రుతివర్ణనైకరసికో వాణీం సముల్లాసయన్
విద్యాదానవిలోలనిర్మలమనా ధర్మైకనిర్మాణభూః
దంపత్యో రనయోః స్సదా వితనుతాం సౌభాగ్యమాయు శ్శ్రియం,

ఇందు వినోదప్రియశబ్దము లేకార్థము లగుటచే నొకటి పునరుక్తము. ఇట వాణిని సంతోషపెట్టుటలో సాధనము నిరూపింపలేదు. "ధర్మైకనిర్మాణభూః" ధర్మమునకు ముఖ్యమగు నిర్మాణస్థానమనుట తప్పు; ధర్మములు నిత్యములగు వేదములచే బోధింపఁబడుచు నిత్యములగుచున్నవి. వానికి సృష్టి చెప్పనొప్పదు. "వితనుతాం" ఇది ఆత్మనేపదము; మొదటిశ్లోకమునందువలె సౌభాగ్యాదులు దంపతిగతములగుచుండ నిట్లు ప్రయోగింపనొప్పదు. పరస్మైపదమొప్పు; ఇందు బ్రహ్మార్థబోధకమగు కర్తృపదము లేకుంట శోచనీయము.

(౪) శ్లో. శచీలేఖాధీశౌ శ్రితజనమనోభీష్టఫలదౌ
సమాసీదంతౌ యౌ సకలసురసామ్రాజ్యపదవీం
వరం రాజానం తౌ సకలధరణీపాలనపతిం
విధత్తాం కన్యాం సద్వినుతపతిభక్తి ప్రణయినీం.

"సమాసీదంతౌ" ఇది యసాధువు; సమాసీదతః, అనియుండవలెను. సకలధరణీపాలనపతిం=పాతిరక్షతీతిపతిః రక్షించువాడని యర్థము లభించుచుండ "పాలన" శబ్దమును గూడ ప్రయోగించుట నిరర్థకము; అనన్వితము నగుచున్నది;

(౫) శ్లో. శ్రీకళ్యాణమహోత్సవే జనకజాం దృష్ట్వావిభో రాకృతీః
కుడ్య స్తంభనిబద్ధభూమిషు పురఃపశ్చాదధస్తాదపి
కింకర్తవ్యవిమూఢవిస్మితముఖీం దృష్ట్వా విహస్యన్ ముహుః
రామః ప్రేమరసాకులో వితనుతాం సౌభాగ్య మాయుః శ్రియం.

ఇదియు ననన్వయశ్లోకము; ఇందు జనకజాం=అనునది సన్నిహితదర్శనక్రియతో నన్వయించక తృతీయపాదస్థవ్యవహితదర్శనక్రియతో

నన్వయించి దూరాన్వయదుష్టమైనది; అట్లన్వయించునెడల "ఆకృతీః" అనుదాని కాదోషము. కళ్యాణోత్సవమున సీతకు కర్తవ్యమెద్దియో తెలియదు. అట్టికర్తవ్యమున విమూఢత ముఖమునకు జెప్పుటతప్పు. జ్ఞానాజ్ఞానము లాత్మనిష్ఠములు గాని ముఖాదిదేహావయవనిష్ఠములు గావు. అటులే విస్మితత్వము ఆత్మనిష్ఠము. ముఖమునకు విశేషణముగా చెప్పుట యశాస్త్రీయము; విహస్యన్=అసాధువు; విహాసన్=అనియుండవలెను; శత్రాదేశము దుర్లభము; "వితనుతాం" ఆత్మనేపదము. ఈశ్లోకముం సౌభాగ్యాదు లెవరికి కావలయు నని కోరుచున్నాఁడో కవి వ్రాయలేదు, ఈ యాత్మనే పదప్రయోగముచే తనకే కలుగవలయునేమో యనునభిప్రాయమున నాత్మనేపదము ప్రయోగించుకొని యెనందుమా? ఇది వధూవరుల కాశీర్వచనము కాదా?

సీ. తగునయ్య! యోయి! సీతారామశాస్త్రి! నీ
యింటిపేరికిఁ బోలి యెసకమెసఁగు
నీకవిత్వము కంటకాకీర్ణము మహోప
లావృతమధికసాలావృకాది
సత్వాన్వితము ఘోరసంచార మతి గహ
నమ్ము సంస్కారశూన్యమ్ము మంగ
ళమ్ము నీసమ్ము శుష్కమ్ము దోషైకవే
ద్యమ్ము రక్షఃపిశాచాంచితమ్ము

తే. చెప్పినారము తగవిమర్శించి నీవు
కృష్ణవర్త్మను బ్రార్థించి గ్రీష్మమేగ
కుండసంస్కార మొనరించుకొమ్ము దాన
భూతిగలవాడ వగుదు వీ భూతలమున.

సీ. శ్రీరామ! రామ! సీతారామ! నీచెప్పి
నవి లెక్కకైదు పద్యములు గావె

యపి నిన్నుఁ బోషించు నవనీశ్వరుని పెండ్లి
వేళఁ జెప్పితివి దీవించుపాంటు
నా రెంటి మాటిలో నారయ నిన్ని దో
షములుండెఁ గనవు విశ్రాంతి చెడుట
యశ్లీలమెట్టిదో యరయఁజాలవు ధాతు
రూపనిష్పత్తుల రూపెఱుఁగవు

తే. ప్రత్యయవిభేద మన్వయక్రమము నీకుఁ
దెలియకుండెను శబ్దమే తెలియలేవు
నీ కవిత్వము పైత్యము నేర్చికొనిన
వెనుకఁ జెప్పుము లేకున్న పిడుచు కొనుము.

ఉ. నీదగుపాండితీప్రతిభ నీరచియించిన పద్యపంచకం
బే దెసలెల్ల మ్రోయ వచియించెడి నీదు తెలుంగు బాసయో
కాదన కేనటంచుఁ గడకట్టుచు నిచ్చినపొల్లసాక్ష్యమే
వాడుదొలంగఁజేయునిను వహ్వా! యనందగు నోవనాహ్వయా.

ఉ॥ నీవిటువంటివాడవని నీనువిమర్శన సారమెల్లఁగా
శివరపండితుల్ తెలియఁజేయ నెఱింగి మహీమహేశ్వరుం
డీవఱకే మహాబిరుదమిచ్చి రసించెను రెండుభాషలం
దీవు మహాసమర్థుఁడని మెచ్చుచు నోవనవంశవల్లభా॥

ఉ॥ బాసయొనర్చిపండిత సభాముఖమందుఁ గవీంద్రచంద్రుఁడై
భాసిలు కృష్ణమూర్తి కవివ్రాసివచించిన తీర్పుతీర్పునా
రోసితి నీవుపౌరుషము యూష్మికినెక్కినవాఁడవేని నీ
బాస సమర్థమై జగతిఁ బర్వగఁజేయుమయోవనాహ్వయా॥

చ॥ కవికులసార్వభౌము నటుకాఱులువల్కియు దూరనాదిస
త్ప్రవరులు చెంతనుండి వినఁ దల్లినిబోలిన రాజ్ఞితోడ వే
ఱవుగతిఁజెప్పి రాముసిని సాక్ష్యము వెట్టితె లేనివాఁడెటుల్
నవచెడనయ్యె నయ్యయొ మలామటు లై వనవంశబాడబా.

ఉ॥ వేషమదెంతకాలము ప్రవీణపదంబున నిల్వఁబెట్టు నీ
రోషమె నీదువేషమును దొర్లగఁజేసి యధోగతుల్ పుస
ర్భాషయొసంగనట్లు సలుపంగల దింతటిలోన నేటికీ
రోషము నీవనంగ నెవరోయనకుండెప్రవనాశ్వయోద్భవా॥

ఇట్లు శ్లోకపంచక నిరాకరణమందలి ముఖ్యాంశములన్నియు వ్రాయబడినవి. ఇదియేసర్వవిధముల నసహ్యముగా నున్నదని బాలసరస్వతిగారు వాకొనినది. వనంవారిని తిట్టి దిగపాఱబోసితినని వ్రాసినది. మానవమాత్రులెవ్వరును నామోదింపరని పలికినది, పాడువ్రాతలనివాకువ్వబడినదియు నిదియే. ఇందలి చివరపద్యములే పాడుపద్యములని శాస్త్రిగారు పేర్కొన్నవియు, ఈపాడు వ్రాతలనే సాక్షాద్భగవంతుఁడవతరించినను సమర్థింపనేరడని వ్రాయబడినవియు నివియే. ఇందుని రాకరణముండినను౦డుగాని దూషణమావంతయులేదు. కవికి తెలియనిచోట నీకు తెలియలేను. ఇది నీతప్పు. అనివ్రాయుట తప్పుకానేరదు. అందులోతప్పుచేసినవారిపై "కృతేతుప్రతి కర్తవ్యం" అనియు నిది పరమాపకారిమైన వనంవారిపట్ల వ్రాయదగిన దానికంటె నూఱురెట్లు తక్కువైనదనియే నానిశ్చయము. ఇట్లునేవ్రాసిన దానిపై వనంవారు "దోషాభాసనిరాస" మనుపేరితో నేతిబీరకాయ పొత్తకను వ్రాసి దానిపై కొంతమంది యభిప్రాయములను సూచించి, సేకరించి ప్రకటించినారు. అందుమనచెళ్ళపిళ్ళవారియభిప్రాయము౦ జిత్తగింపుడు............ మీశ్లోకపంచకమును చదివి చూచినాను. అందు అశ్లీలాదులున్నవని పనిలేనిపాటగా విమర్శించినవారి యాక్షేపణలును చూచినాను. ఇదేతీరున విమర్శించిన యెడల నెవరికవిత్వమందేని దోషములు తీయవచ్చును ......అశ్లీలాదులుగూడ ఉద్దేశమునుబట్టి పనిచేయును. గాని లేనిచో బనిచేయవని నాయుద్దేశము. ఇంతకునునట్టియశ్లీలాదులు ఝడితిస్ఫూర్తి నందుటలేదు. అతిప్రయత్నముమీద నెక్కడనేని ఈయూదోషము

లను చూపవచ్చును...దీనిపై విమర్శనము సర్వాంధముల ననహ్యము గా నున్నదనుటకు సందియము లేదు. పాణిని యొప్పకున్నను యావత్తర్కశాస్త్రగ్రంధ నిర్మాతలును, వేదాంతశాస్త్ర గ్రంధనిర్మాతలును నిరాఘాటముగా వాడిన "కాలీస" యను పదమును గూడ విమర్శకు లాక్షేపించుట శోచనీయము. ఉభయపదులగు ధాతువులను ప్రయోగించుటలో పూర్వకాలమందెట్టి కట్టుబాటులున్నను, ఇటీవలి మహాకవు లెవ్వరుగాని యాత్మగామిత్వ పరగామిత్వాదులను గణింపకనే ప్రయోగించుచున్నారు. ...తప్పుల నిరూపించి సంతుష్టిచెందక తుట్టతుదను పద్యములని పేరుపెట్టి యందశ్లీల ప్రధానమగు శ్లేషతో మిమ్మాదిట్టుటకు మానవమాత్రుడెవ్వడును నామోదింపడని నేను నొక్కివక్కాణించుచున్నాను. ఒకవేళ మీరు నావిమర్శకుల నింతకుమున్నే దూషించియున్నచో యాదూషణము "కృతేతు ప్రతి కర్తవ్యమేష ధర్మస్సనాతనః" అనురీతిని సమర్థింపబడునేమో గాని, యన్యథాగా సమర్థింపబడదు......అందలి పాడువ్రాత వారు గారుగదా. సాక్షాద్భగవంతుడవతరించినను సమర్థింపనేరడని నాయాశయము"

చూచితిరా శాస్త్రిగారి యభిప్రాయము? ఇదియెంత మంచిదిగానున్నదో? ఎంతశాస్త్రీయముగా నున్నదో? యెంతవైషమ్యరహితముగా నున్నదో? విచారింపుడు. "ఇదే తీరున విమర్శించినయెడల నవరికవిత్వమందేని దోషములు తీయవచ్చును" అను వీరివాక్యము వలన నిందు దోషము లున్నవని యొప్పుకొనుట కాదా? "ఇంతకును అట్టియశ్లీలాదులు నాకుదీనిస్ఫూర్తి నొందుటలేదు" అనుటవలన నిందశ్లీలమున్నదని వారియభిప్రాయము కాదా? "అతిప్రయత్నముమీద నెక్కడనేని యీ యా దోషములను జూపవచ్చును" అనుటవలన నిందు దోషము లున్నవని యొప్పుకొనుచున్నారుకదా! "పాణినియొప్పకున్నను" అనుటవలన పాణినిమతమున కాలీసశబ్దము దోషమని వీరి

యంగీకారమేకదా! "ఉభయపదులగు ధాతువులను ప్రయోగించుటలో పూర్వకాలమం దెట్టికట్టుబాటులున్నను ఇటీవలమహాకవు లెవ్వరుగాని యాత్మగామిత్వ పరగామిత్వాదులను గణింపకయే ప్రయోగించుచున్నారు" అనిరి. దీనివలన ఇప్పటివారిమాట తరువాత విచారింతము. పూర్వమందైన నిట్లు ప్రయోగించుట తప్పని యొప్పుకొనుచునే యున్నారు. "ఒకవేళ మీరు నావిమర్శకుల నింతకుమున్నె దూషించి యున్నచో ఆదూషణము "కృతేతు ప్రతికర్తవ్యమేషధర్మస్సనాతనః" అనురీతిని సమర్థింపఁబడునేమో" అనిరి. దీనివలనను మావ్రాత సమంజసమేయని తేలుచున్నది. వారు మమ్ముదూషించినపిదపనే యీ విమర్శనము వ్రాయఁబడినది. ఇట్టిశాస్త్రిగారియభిప్రాయ మెంతచక్కఁగానున్నదో పండితులకు తెలియుచునేయున్నది. నాపై నిట్టివ్రాతలు వ్రాసినపుడు నేను చచ్చినట్లు పడియుండవలెను గాని దానిపై నేనెట్టివ్రాతలను వ్రాయఁగూడదని శాస్త్రిగారియభిప్రాయము. దీనిపై నేను శృంఖలములో విమర్శించినందులకే వారికాగ్రహము పెచ్చుపెరిగినది. ఇందు తాముచేసినతప్పు, తాము సవరించుకొనుపాటి శక్తి లేక నావ్రాసినవ్రాతలు "దారుణాతిదారుణము" లని వాకొన మొదలుపెట్టినారు. ఎట్లో తనకంటబడిన శృంఖలవిషయము తామెత్తుకొనక "దొంగకు తేలుకుట్టినట్లు" ఊరకుండక తనతప్పు తానే బైటపెట్టుకొనునట్టి వారైనందులకు లోకము హీ హీ యనకమానదు.

శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారు — "పుల్లెల శ్రీరామశాస్త్రిగారు చూపిన దోషములు దోషాభాసములు గాని దోషములుగావు. వనం సీతారామశాస్త్రిగారు చేసిన విమర్శనము శాస్త్రీయము"

వేదుల సూర్యనారాయణ శాస్త్రిగారు — "పుల్లెల శ్రీరామశాస్త్రిగారు చేసిన నాశంకలకు పేరుచెప్పిన సమాధానములు న్యాయ్యములు. విమర్శనము తుదనువ్రాసిన పద్యములు చదువరులకు వ్యథను గలిగింపక మానవు."

చిలుకూరి సోమనాథశాస్త్రిగారు—"పుల్లెల శ్రీరామశాస్త్రి గారు చెప్పినయాక్షేపణలు ఆభాసరూపములుగ నున్నవి. సీతారామ శాస్త్రిగారు చెప్పినసమాధానము శాస్త్రీయము."

మఱియుఁ గొందఱియభిప్రాయములు కలవు. వీరందఱువ్రాసినవియు నొక్కవిధముగానే వారి వారివ్రాతలుచూచి వ్రాసినట్లుగానే యున్నవి. శ్లోకములుగాని నిరాకరణముగాని, వనంవారి సమాధానముగాని చూచి విమర్శించి యిచ్చినయభిప్రాయములు మాత్రము గావు. వనంవారుపోయి మొఱ్ఱవెట్టుకొనగా నను గ్రహించినవియే యనుట నిశ్చయము. ఈమాటకు శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారి వాక్యమే సాక్ష్యమగుచున్నది. అది ముందు చూడఁగలరు. ఇతరులు నన్ను ద్వేషించియున్నవారు. వారు నాపై నిడిన యభిప్రాయములకు విలువలేదు.

పండితులారా, వనంవారి మొదటిపద్యములో "ఆసీశాం" అను చో యతిభంగమును, భర్తలేనిది యమంగళ్లము లేదా? "కురుతాం" యనునది ఆత్మనే పదము కాదా? వధూవరుల కాశీర్వచనమందు పరస్మైపద ముండవలదా? "ఆలోకతాం" లోకృధాతువాత్మనే పదము గాన నాలోకమానయోః" అనియుండవలదా? "వితనుతాం" ఆత్మనేపదము. ఆశీర్వచనమువదగునా? "సమాసీదంతౌ" ఇదిసరియా? "సమాసీదతః" అనియుండవక్కరలేదా? "విహాస్యన్" అనియగునా? "వితనుతాం" ఆత్మనేపదమిటులగునా? వనంవారు రాజు నాశీర్వదించుచు చెప్పినవి లెక్కకయిదుపద్యములు. అందు. సామాన్యదోషములుగాక దురుద్ధరదోషములనినిరూపించినవి ముప్పదిమూఁడు. ఇవిసాధువులగునా? కఱికుక్కను గంగిగోవుగాచేయఁ దలంచినట్లు మీరు సాధువులం జేయఁగలరా? దీనిపై వనంవారిచ్చినసమాధానములు చిత్తగించితిరా? అవి సాధువులని మీరు నిర్ణయించితిరా? మీరు వీనిని విమర్శించి నభిప్రాయము లిచ్చియున్నా గని యూహించుట కెంతమాత్రము వలనుపడకున్నయది. మీరిట్టివిమ

ర్యముగా నభిప్రాయము లిచ్చుట మీాయశస్సునకు కళంకము తెచ్చు నట్టిదగుచున్నదని నాయభిప్రాయము.

అభిప్రాయవిమర్శనము.

శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారు — తర్కశాస్త్రములో పండితులనుటకు సందేహము లేదు. సర్వతంత్రస్వతంత్రులు, సమదర్శులనుటకు మాత్రము నేను సాహసింపను. ఉండనిండు ఆలక్ష్మీనరసింహశాస్త్రిగారియొద్దకు వనంవారుపోయి "అయ్యా! నాకింత కూడు పెట్టుడు. నిరాకరణగ్రంథమువలన నాకు మాసంస్థానములో నప్రతిష్ఠ వచ్చినది. మామహారాణీగారు నాయసమర్థతను గ్రహించిరేని నాయుద్యోగమునకునీళ్ళుపోయింతురునన్ను రక్షింపుడు," అనిదీనుడై యెన్నో చెప్పి రామనాథశాస్త్రి మొదలగువారిచే చెప్పించి ప్రార్థింపగా, దయామయులగువారు పూర్వోత్తరసందర్భములు నరయక నొక యభిప్రాయము వ్రాసియిచ్చి, తాము వ్రాసియిచ్చిన యీ యభిప్రాయము "మీా మహారాణీవారికి మాత్రమే చూపవలయు ననియు; అది ప్రకటింపవలద"నియు ప్రమాణము చేయించుకొని యిచ్చినట్లు లక్ష్మీనరసింహశాస్త్రిగారే దర్భా సర్వేశ్వరశాస్త్రి ప్రభృతిపండితుల సమక్షమున నాతోఁ జెప్పినారు. వ్యాకరణవిషయముగనుక వారు ప్రమాదపడి కొన్నివిషయములు వీరికిఁ జెప్పినారు. అవియే వీరివ్రాతకాధారములు, విచారింపఁగా లక్ష్మీనరసింహశాస్త్రిగారు తమయభిప్రాయములో నెంతయు ప్రమాదపడిరని చెప్పుటకు సందేహపడనక్కరలేదు.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు: — వీరు మిక్కిలి శ్రమచేసి రెండుపుటలగ్రంథము శ్రద్ధతో వ్రాసి వనంవారికి దయచేసినారు. వీరికి నాయందు నిర్వ్యాజమైనప్రేమ. "అంతేవాసిని నేను కృష్ణకవికయ్యంతర్వాణికి ప్రేమమగ్గలమునాపై" అని ముక్త్యాలరాజావారియొద్ద పద్యరూ

ముగా చెప్పియున్నారు. వీరు కొంతకాలము నాయొద్ద విద్యాభ్యాసము చేసినారని లోకమనుకొనుచున్నది. వీరు "గీరత" మను నొక మహా గ్రంథమును రచించినారు. అందు నాయొద్ద నొక్కింత చదివితి నని వ్రాసినారు. నేనుమాత్ర మెటగాని ఇది యిట్టిదని వ్రాసిగాని చెప్పి గాని యెఱుంగను నిశ్చయము. ఇందువలన నాకు రాబోవుగౌరవము లేదు. ఇట్లున్న సందర్భమున రాజమహేంద్రవరములో మ॥ రా॥ రా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు అగ్రాసనాధిపతులై రాజరాజనరేంద్ర వర్ధంతిసభలో భారతయుద్ధమునకు పూర్వముధర్మరాజాదులకు కర్ణుడు కానీనుడని తెలియదు. నన్నయభట్టు ప్రమాదపడినాడో లేఖకులు సంస్కరించినారో కాని యర్జునునిచే "కానీన" యని కర్ణుని సంబోధింపించినారని చెప్పినారు. దానికి నే నంగీకారమిచ్చితిని. వేంకటశాస్త్రి గారు "కానీన" యనవచ్చునని. ఈ విషయము కొంతకాలమునకు నేను గానాల రామమూర్తిగారితో వడుగగా చెప్పినారు. ఆయన దీనిగూర్చి యొకవ్యాసము ప్రకటించినారు. అది నేనువ్రాసితినని భ్రమపడి నాపై నిందాగర్భముగా "జలతాడన" మనువ్యాసము వ్రాసి కృష్ణాపత్రికలో ప్రచురించినారు. నేను దానికి సంతసించితిని. బదులు వ్రాయలేదు. నే నేమియుం జేయలేదు. నీది ప్రమాదమని వారికొక కార్డుమాత్రము వ్రాసినాను. మఱియు ముక్త్యాలరాజా గారితో నావిషయమేమో చెప్పి యేమో చేసినారు. పాలకొల్లువారికి నాకుంగల భారతసంబంధము తెంచుకోవలయునని నాకెంతో ప్రోత్సాహము చేసినారు. తుదకు పాలకొల్లులో కృతిగ్రహణసమయమున నెట్లో చెప్పుమనని యెట్లో చెప్పినారు. మఱియు నెన్నోకలవు. మాబంధుత్వమిట్లున్నదని చెప్పుటకిట్లు కొన్నిమాత్రము చెప్పినాడను వనం వారు జయంతిరామనాథశాస్త్రి (ఈయన వేంకటశాస్త్రియొద్ద కొంచెము చదివినాడట) యనువానితో కడియము గ్రామమునకు వెళ్ళి

యట్లు చెప్పవలయునో యట్లు చెప్పి దేవురించుటంజేసి యీ యభిప్రాయ మిచ్చియుందురు. వీరి యభిప్రాయములో పుక్కిడిపురాణము మాటలు వ్రాసినారు. నైషధము, మహాభాగతము, వసుచరిత్రములవే ళ్ళుదాహరించినారు. వానిలోనే తప్పులున్నవనిరి. శ్రీభూపుత్రిలో భూతిపోయెనని తెనాలిరామలింగకవియనినట్లు పురాణవాక్యముఁ జేర్కొనిరి. హా! హా! వారివారిగ్రంథములెక్కడ? వనంవారి శ్లోకాభాస గ్రంథమెక్కడ? నక్కయెక్కడ? దేవలోకమెక్కడ? వనంవారి శ్లోకముల మెచ్చగలిగిన వీరినెంత కొనియాడవలయునో తెలియదు. వనంవారు వీరిని కొల్లాపురమునకు తీసికొనివెళ్ళి మహారాణీగారిచే వేయినూటపది యాక్షేపింతునని చెప్పియున్నారేమో? ఆహా! ధనమెంతచెడ్డది! తల్లిని, తండ్రిని, గురువును, దేవునైన పరిగణింపనీదుకదా? "తవ నతక్ష్మనివర్తతాంశివం" ఇందశ్లీలముఁ కలదని తాత్కాలికులనిరసిరి. తాత్కాలికులేగాదు, ఇదానీంతనులు ననుచున్నారు. ఏటిక్రొత్త? కానీన శబ్దము వ్యాకరణశాస్త్రముచే సాధువనియు, "అనీశాం" అనుచో నశ్లీలము, యతిభంగము కాదనియు సాధించినప్పుడు వీరిమాటలు పాటింపతదు. అశ్లీలాదు లుద్దేశమునుఁ బట్టి పనిచేయునట! కానిచో పనిచేయనట! "తాఁ బోయినమీనమాసమున పున్నమఁబోయిన షష్ఠినాటికిన్" ఇట కవి కుద్దేశమున్నదా? కవి యేమయ్యెనని వీరు విందురు. "బాలకమరె" అని అశ్లీలార్థమున నేమిపిందురు? అశ్లీలము వక్తృతాత్పర్యవిషయము కాకపోయినను దోషముగా కావ్యప్రకాశము నస్తమోల్లాసమున "పితృవసతి మహం వ్రజామితాం" ఇత్యాదావశ్మశానాదిప్రతీతావమంగళార్థత్వం" అని చెప్పఁబడినది. ఇత్యాదులు వేనవేలు గలవు "ఎఱుగికంటిసవహ్ని యెఱువఁజేయు". అట్లుద్దేశము లేకున్నను అశ్లీలమమంగళప్రతిపాది కాకమానదు. వనంవారి శ్లోకములోనియ శ్లీలము షుకిలిస్ఫూర్తియగుటలేదనుట సాహసము. "దీనిపై విమర్శనము

సర్వవిధముల నసహ్యాముగా నున్నదనుటకు సందియము లేదు" దేనిపై విమర్శనమో తెలియదు. కామిలారోగికి లోకమంతయు పచ్చగానే యుండును. అసహ్యాములను సహ్యాములని తలంచువానికి సర్వమును సహ్యమే. శబ్దసాధుత్వమునకు పాణిని ప్రమాణము కాని తర్కము ప్రమాణము కాదు. కాలీన శబ్దము తార్కికులు వాడిరని సుధీమణి చెప్పుచునే యున్నాడు. వ్యాకరణముచే నది తప్పనెను. ఆమాట సత్యమా? కాదా?

"పాణిని యొప్పుకున్నను" అని తానువ్రాసిన వాక్యముచేతనే యది సత్యమని తేలుచున్నది మహాకవుల గ్రంథములలో నెటనేని ప్రమాదమునంజేసి కాలీన శబ్దము పడియుండవచ్చును. అది మనకుం బ్రయోగశరణ్యము కాదు ఆర్షములును బ్రయోగశరణ్యములు కావు. దీనికింత గింజులాట యేమిటికో? క్వాచిత్కప్రయోగ ప్రదర్శన మేమిటికో? వీరు తమకవిత్వములో నాత్మగామిత్వ పరగామిత్వములను గణింప నుభయపదులును వాడుదురా? అట్లువాడిన వీరిది కవిత్వమని యెంచుటకు వలనుపడదని నాయభిప్రాయము. నాఁడన్నవరము సభలో నల్లమరాజు సోమకవిశ్లోకములోని యాత్మనే పదికి వీరెందులకంత కోలాహలము చేయవలయునో? ఆధునికులీ నియమము గణింపక ప్రయోగించిన నవి ప్రమాణములు కావనియే నానిశ్చయము. అట్టి ప్రయోగములుచేసినవాఁడు మహాకవియనిపించుకొనఁడు. ఇట్లు వ్రాయుట కవిననిపించుకొను వేంకటశాస్త్రిగారికిఁ దగదనియు నదికాకవుల వలసినదనియు మాత్రమనక తప్పదు. "అనేకములిందులకుఁ బ్రయోగములు కలవు. ఇది యిటులుండెట్టు ఉండుఁగాక. లేకపోవుగాక" అని వ్రాసిరి ఈవ్రాత చిలకమర్తివారి యుపన్యాస ధోరణింబోలి యున్నది. బంధుత్వమూరక పోయినది గాదు.

"తుట్టతుదను బద్యములని పేరుపెట్టి యం దశ్లీలప్రధానమగు

శ్లేషతో మిమ్ముఁ దిట్టుటకు మానవమాత్రుఁ డెవ్వఁడును సాహసింపఁ డని నేను నొక్కి వక్కాణించుచున్నాను. అందలి పాదము వ్రాతవారు గారుగదా సాక్షాద్బ్రహ్మయంతటివాఁ డవతరించినను సమర్థింప నేరఁడు” అని వారి యభిప్రాయాంతమున ముడిగట్టిన మాటలాలించినారు. శ్రీరంగ నీతు లెన్నియైనఁ జెప్పవచ్చును. చెప్పినట్లు చేయుటదుర్లభము. పద్యము లని పేరుగాని పద్యములుగావట! అంతకన్న మిన్నగాఁ దాము వెలిగించిన పద్యము లున్నప్పుడు చూతము. అశ్లీలమఁట! ఇంతకుమున్నే కాదా? అశ్లీలములు దోషయుక్తములు కావనె. ఇదియేటిమాట! అందలి పాదు వ్రాతయన నేమియో? పాదువాండ్రకుఁ బాదువ్రాఁత కాకయేమగును? వీరేగాఁబోలు నోరులఁ జెందనాడనివారు! ఇట్లు వ్రాసినంతమాత్రఁ దామొక మహర్షులై ముడిగట్టుకొనువారు కాలేరు. తనచేత, అమ్మ, ఆలి, అనికూడఁ దిట్లు దిన్నవారును, చావులు, బ్రదుకులు నొందినవారును, శ్రాద్ధాదులు పెట్టించుకొన్నవారును, పరిహసింపఁబడినవారును దేశములోఁ బెక్కురుకలరు. అవసరమైనచో నవియన్నియుఁ బ్రమాణీకరింపగలను. వీరియొద్ద రామకృష్ణకవులలో నొకరు రెండుముక్కలు చదివి కాలాంతరమునఁ దన్ను గురువనలేదని వారిపై వీరు దుమ్మెత్తిపోయలేదా? గీరతనము వారినిదిట్టుటకైయెవది కాదా? గద్వాలలోఁ దమ్మధిక్షేపించిన వారిపై “శనిగ్రహము” వ్రాసి శపింపలేదా? తన్ను “తరవాణికుండ” అనిపిలిచిన కడియమువారిపై నానాదుర్భాషలు, శ్లేషలు, అశ్లీలములు, అమంగళములు, గలుగునట్లు మల్లేశ్వర శతకము వ్రాయలేదా? కామేశ్వరీశతకములో నున్నదంతయుఁ బరదూషణమే కాదా? నీతులు చెప్పుటకేమి. పరోపదేశవేళయం దందరును గురువులే. మహానుభావులే. తననెత్తిమీఁదికి వచ్చినప్పుడుగదా! యోగ్యతాయోగ్యతలు తెలియవచ్చుట! సుధీమణివాక్యములలో భవంతుఁ డవతరించినను సమర్థింపనేరనంత దోష మేమియున్నదో?

వేదుల సూర్యనారాయణశాస్త్రిగారు:— పిఠాపురము మహారాజావారు వీరికి మాసాశనమిచ్చుచున్నారు. వీరు వ్యాకరణశాస్త్రము చదివినమాట నిజమే. ఇప్పుడుపస్థితిలో నున్నదో లేదో? సాగుఛాందసులు. వనంవారు పోయి కాళ్ళుపట్టుకొని దేవులాడుటచేత పూర్వోత్తరసందర్భ మెఱుఁగఁజాలక సామాన్యమైన తమయభిప్రాయ మిచ్చియున్నారు. నేను బోయి మఱియొక యభిప్రాయమిండని కోరిన నాకును మంచియభిప్రాయమే యీయఁగలరు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, పానుగంటి లక్ష్మినరసింహారావుగారు:— వీరిరువురును గలసి అభిప్రాయమిచ్చినారు. అందు సుధీమణిగారి గ్రంథవిషయమై యంశమాత్రమును లేదు. అది మమ్ము నిరసించునదికాదు.

శ్రీమన్నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార వేంకటాచార్యులయ్యవార్లంగారు, చిలుకూరి సోమనాథశాస్త్రిగారు:— ఆచార్యులుగారెవరో నాకుఁ దెలియదు. సోమనాథశాస్త్రిగారిని నే నెఱుంగుదును. శాస్త్రిగారు వ్యాకరణపండితులే గాని వారు సుధీమణిగారు వ్రాసిన నిరాకరణగ్రంథమును సావధానముగాఁ జదివియుండలేదనియు; వనంవారిప్రార్థనంబున ఇట్లు తమయభిప్రాయమును వ్రాసియిచ్చిరనియుఁ దలంపవలసి వచ్చినది.

తంగిరాల జగన్నాథశాస్త్రి, డి. వెంకటావధాని. జయంతి రామనాథశాస్త్రిగార్లు;— వీరు విద్యాభ్యాసము చేయుచున్నవారు. వారిమాటలు పాటింపఁదగినవికావు. ఇందు రామనాథశాస్త్రి యనువారు వనంవారి ప్రాణతుల్యులు. ఆయనవ్రాత యుక్తాయుక్తము లెఱిఁగి వ్రాసినదికాదు. ఈయనయే వనంవారిచే నానాపండితుల దర్శనము చేయించి ఈ యభిప్రాయముల నిప్పించినవారు. ఈ వైరమునకాతఁడే కారణము. నేను జడ్జిమెంటు చదివిననాఁడు తా నట (కొల్లా

పురములో) నున్నాఁడు. నాది జడ్జిమెంటు కాదనియు; నేను దురహంకారిననియు వనంవారు నన్ను తిరస్కరించుట చెవులతో విన్నాఁడు. వినియు నిల్లు నాయందు సీతారామశాస్త్రిగారికి "గౌరవాభావము లేదు" అని వ్రాయుట యవివేకము. నేను తెరచాటునుండి నాటక మాడించుచున్నానట! ఈయనకు బొమ్మలాటలో కూడ ప్రవేశమున్నట్లు దీనివలనఁ దెలియుచున్నది. ఆయనకు దోషమేమో దోషాభాసమేమో తెలియదు. ఆయన వ్రాతకు సమాధానము వ్రాయుటయు తప్పని విరమించితిని.

ఇవియే పండితుల యభిప్రాయములపై నేను వ్రాసిన వ్రాతలు. ఇవియే పండితులను తిట్టితినని మనశతావధానిగారు పలుకగలిగిన పంక్తులు. ఇందులో నెట్టితిట్లున్నవో విజ్ఞులకుఁ దెలియకపోదు. వనంవారి గ్రంథమును ఖండించుచు గ్రంథము వ్రాయునప్పు డందుగల పండితాభిప్రాయములవిషయ మిట్టిదని వ్రాయుట తిరస్కరించుట కాదనియు, విమర్శకులు చేయఁదగినదియే యనియు నాయభిప్రాయము. ఆ పండితులలో చిలుకూరి సోమనాథశాస్త్రిగారు స్వర్గస్థులైరి. వారున్నచో వనంవారు వారికడ నెంతమోసముచేసి వారియభిప్రాయము తీసికొనిరో సెలవిచ్చియుందురు. కాని వారు దివంగతులు కాక పూర్వము శ్రీ పిడపర్తి చినపూర్ణయ్య సిద్ధాంతిగారి కుమారుఁడు కృష్ణమూర్తిశాస్త్రిగారితో "వనం సీతారామశాస్త్రిగారను నొకరు నాయొద్దకువచ్చి తమ కేదో తమసంస్థానములో నప్రతిష్ఠ వచ్చినదనియు లోనగుసంగతులు చెప్పి యేదోయొక శ్లోకము చదివి నాయభిప్రాయ మిమ్మని ప్రార్థింపఁగా నేను వ్రాసియిచ్చితిని" అని చెప్పినట్లు పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు నాతో చెప్పియున్నారు. శ్రీపాదలక్ష్మీనరసింహశాస్త్రిగారు నాతో చెప్పినవిషయ మంతయు వ్రాసియే యున్నాను. దీనంజేసి వనంవారు, పిఠాపురం తుని లోనగుచోట్లకుం

బోయి వారివారి కాళ్ళుకడుపులు పట్టుకొని సంపాదించిన యభిప్రాయములివి. ఇవి నదభిప్రాయములుకావు. దీనిపై పెక్కుదేశముల నుండి మహాపండితుల యభిప్రాయములు సేకరించియుంచితిని. అవసరమైనచో వానినెల్ల ప్రచురించి ప్రమాణీకరించెదంగాక.

— చంకదుడ్డు శరణార్థి —

"శాస్త్రిగారి క్షమాపణ" ఈశీర్షికలోనే తమయభీష్టము నెరవేఱుచుండగా "చంకదుడ్డుశరణార్థి" అని జ్ఞప్తికి తెప్పించ నక్కఱలేదు. శరణార్థియై సమీపించినప్పుడుచంకదుడ్డు హానిచేయు నేమోకాని శరణార్థియనువాని చేరనీయక వెళలగొట్టినప్పుడు ఈచంకదుడ్డు నాచిన్నిలోమునైనఁ గదలింపనేరదు. ఇదిబాలబిభీషిక. ఇట్లు వ్రాయుటబాలచాపలము. ఇట్టివాఁడేయజముఖవ్యాఘ్రము, పయోముఖవిషకుంభము నాఁబడు. ఈవ్రాఁతచే వీరిదుందుడుకెట్లు తెలియుచున్నదో చిత్తగింపుఁడు. ఇది వారిదోషముకాదు వారిస్వాతిశయదోషమే. ఈదుడ్డుచే నాబుఱ్ఱ పగిలించుచున్నామని సూచించుచున్నారుగాని ఏమోచేయఁబోయి యేమో చేయించుకొన్నట్లగునేమో? కానిండు చూతము.

"మాఘమునకుఱకు" అనుదానివిషయములో "నాది ప్రమాదమేమో యని నీవు సమాధానపడవచ్చునే" అని నేనువ్రాయుటచేత వారిచర్యలో వ్రాసినది యసత్యము కాలేదని బోధపడుచున్నదనిరి. అట్లయిన వారికి మనస్తాపోపశమనం బగుటంబట్టి నేను ధన్యుడను కాని యిట వీరిబుద్ధి బూరెలు తిన్నట్లే యున్నది. "ఏమో" యనునది నిశ్చయార్థమా? సందేహార్థమా? అట్లు తమకు బోధపడిన బోధపడవచ్చును గాని లోకమునకు బోధపడునా? పడదు. ఇట్లు పెడర్థములు చేసికొనువారు గనుకనే వారివ్రాతలు వారిచేతలు వారినీతులు నిట్టి స్థితిలోనికి వచ్చినవి! "తాము వ్రాయుటచేత నే నిట్లు వ్రాసితిని గాన తమకుపకారము గలిగినది. దాన తమవ్రాత లన్నింటు

నుపయోగించునవియే గాని త్రవ్వుకొనుట పూడ్చుకొనుట వంటివియు, పత్రికలుమాత్రము నిండించునవియు, నగుబాట్లు తెచ్చునవియు కా" వని సమర్థించుచున్నారు. ఏమో యనువో నేదకారార్థము చేసికొన్న ట్టిదే యీ సమర్థనమును. ఈనడుమ నేను వ్రాసినసమాధానములో "నీ వ్రాతలలో హెచ్చుతగ్గు లున్నవి. ప్రతియంశమును ఖండించి స మాధానము వ్రాసి లోకమును మెప్పింపగలను. నవ్వుటాలపాలు గాను ము" (ఉ.కు.స.) ఇందు మొదటిరెండును నా వ్యాసములు చదివినవారికి తెలియుచునే యున్నవి. మూడవది నేను వ్రాయనక్కరలేకుండ వారి వ్రాతలే బోధించుచున్నవి ఎట్లందురా? "ఒకనాడు చదివినగురువే ఒక యేడు చదివినగురువే. గురువని ఢంకామీద దెబ్బగొట్టి చెప్పెదను. కుమారసంభవ మేఘసందేశములు చదివినవొకటియు మాఘముచదివిన నొకటియునా?" అని గురువని చెప్పను 5 నెలలని 3 నెలలని 2 సర్గలని లోనగునంశములు చదివినప్పుడు ప్రాజ్ఞులు నవ్వకమానరు. అట్లునవ్వుట నేను గనివిని యెఱింగితిని. తాను గురువుకాక గురువునని గ్రుద్దులాడు వాని విషయమై "నీవు గురుడవు కావు నీయొద్దనేమి జదువలేదు" లో నగు నెట్టిసంగతులు వ్రాసినను వ్రాయవచ్చును. అపుడు లోకము హర్షించును. అట్లుకాక గురువనుచు నిట్లువ్రాయుటం జూచి ఘక్కున నవ్వకమానదు. ఇదిగాక సందర్భశుద్ధిలేనివియు, అప్రస్తుతములైనవియు అయుక్తము లైనవియు వారివ్రాతలు ఇహిహి! యనిపింపక మానవు. మఱియు మూడేండ్లనాటి ముచ్చటంబట్టి ఇట్లువ్రాయుటయు నట్టిదే. చం కదుడ్డు శరణార్థివ్యాసము నా యీవ్రాతలను సమర్థించునది యగు చున్నది.

అభ్యాసములు

ఇట వీరు నాగురుత్వమున "విద్యమాత్రమే కాక మఱికొన్ని యభ్యాసాలు పట్టుబడడానికి లోపలు విశ్వసిస్తారు" అని వ్రాసినారు.

నావల్ల వీరికి మఱికొన్ని యభ్యాసాలు పట్టుపడినవట! అభ్యాసములు సహవాసజములే కాక పారంపర్యములునై పట్టుపడును. నావలన వీరికి—దొంగతనమా? లంజతనమా? వంటపూటితనమా? దురాన్న దుర్దానపరిగ్రహమా? త్రాగుడా? జూదమా? బిచ్చమెత్తుటా? నైచ్యమా? తాళపుచిప్పలా? రజనిచరితమా? గ్రామపౌరోహిత్యమా? దూషణమా? ఆత్మస్తుతియా? ఆగడమా? ఆచారవిహీనతయా? కర్మబాహ్యత్వమా? అహంభావమా? చుట్టలుగాల్చుటా? దుష్టబుద్ధియా? అసూయయా? అవివేకమా? గురుధిక్కారమా? మిత్రద్రోహమా? స్వర్ణస్తేయమా? గురుతల్పమా? కపటమా? కల్లలాడుటా? లోకవంచనమా? డాంబికత్వమా? ఏకసింహమా? పగటివేషములా? పొత్తుగ్లపట్టుటయా? మఱియేవి పట్టుబడినవి?? కులాలకీటమునకు పంక మంటనట్లును, అమేధ్యపదార్థములం దగులుకొన్న యగ్నికి నశుచిత్వ మంటనట్లును. తామరాకున జల మంటనట్లును, తాను శుద్ధుడైనవాడు నెట్టిదుష్టులతో సహవాసము చేసినను. వారిదౌష్ట్యము వీరికంటునంట పట్టినూట. వీరుగండపెండేరకాలమున కవిలక్షణము చూపలేదు. కవిలక్షణమే చూపితి మని వ్రాసినారుగాని, కపిలక్షణమే చూపినారు. తెలుకొండి తన సహజధర్మమును దాను విడుచుననుట విశ్వసనీయముకాదు. ఏతద్విషయ మంతయు సభ్యులందఱును గ్రహించియున్నదే. ఇట వేఱే కపిని కాలేదని చెప్పనక్కఱలేదు.

ఓర్వలేమి

తమచరిత్రలో భేదాభిప్రాయములు పుట్టునని భయముచేత "మూషుమునజీకు" అనుదాసింబట్టి తన్నిశ్చయమునకై యిట్లు వ్రాయుచుంటిమని చెప్పుమాట సత్యముకాదనియు, వీరియభిప్రాయము వేఱనియు, నింతకుమున్న వ్రాసియున్నాను. వారికి నాపై గలయసూయయంతయు నీ సందర్భమున నసందర్భముగా నెంతో వ్రాసి వ్రాసి

తనలోని యోర్వలేమి నంతయు వెళ్ళగ్రక్కినారు. వీరికిట్టిదురూహ నూతనముగా నేడు పుట్టినదికాదు. మొదటినుండియు నున్నది. ఇదినాకు తెలియనిదిగాదు. ఇట "గండపెండేరాల వృద్ధి ౧౫ తన్నాశః ౨" అని శీర్షికతో వ్రాసినవారి వ్రాతలు చూచినవారికి నాపడిన యభిప్రాయము సరి యని తోపకమానదు. శాస్త్రిగారికి నాయం దట్టి సదభిప్రాయము పుట్టియున్నది. నేనునలుగురిలో తల యెత్తికొని తిరుగుట వారికి గిట్టలేదు. నన్ను పాతాళము వఱకు నణగ ద్రొక్కవలయుననియే వారి సంకల్పము. ఇదియే వారిచే నిట్లు వ్రాయించినది. నాకు బిరుదులు వచ్చుట, స్వర్ణాభిషేకము జరుగుట, గండపెండేరము లభించుట భారతము వ్రాయుట, ఇల్లుకట్టుకొనుట మా చెల్లపిళ్ళవారికి కొంచెమైన నిష్టములేదు. ఈనడుమ యెవ్వరో వారి యింటికివెళ్ళి "శిలావిగ్రహప్రయత్నము జరుగుచున్నది" అని చెప్పినారట. ఆమాట వినుటతోడనే తమ దేదో మునిగిపోయినట్లు తనలో ఓర్వలేమి పెచ్చుపెరిగి కొన్నివ్రాతలు వ్రాయనెంచి యేదో కారణముం బురస్కరించుకొనవలయుం గావున మూడేళ్ళనాటి "మాఘమువఱకు" అను నా వ్రాతను బీజముగా చేసికుని ఇట్లుతెగపడి తన యసూయ యంతయు వెడలగ్రక్కినట్లు వారి వ్రాతలు తెలుపుచునే యున్నవి. ఇక్కడితో తమ కడుపుబ్బు తీర్చుకొన్నవా రయిరి. లోకములో ఎవరియేడ్పు వారిదే ద్వవలయును. గాని యొరులయేడ్పునకు తా మేడ్చుట తమకే నష్టము గావచ్చును. ఎవ రెంతయేడ్చినను దైవమనుగూలించినచో కాగల కార్యములు కాకమానవు. వేంకటశాస్త్రిగారియం దభిమానముచేత కృష్ణాపత్రికవారు నన్ననేకపర్యాయములు వెక్కిరించుచు పెక్కువిధములగువ్రాతలు వ్రాసియున్నారు. వారెట్లువ్రాసినను తగినసమాధానము నే నెప్పుడును వ్రాసియుండలేదు. వారు ఆంధ్రదేశములోని కవిసార్వభౌములను, శిల్పసార్వభౌములను పేర్కొనిన పేర్కొందురుగాక. అందు

సాకు గలిగినలోప మేమి? భారతిలో "నిక్కపు కవిసార్వభౌములు" అనిరట! చంద్రాభట్లవారేమో వ్రాసినారట. ఆ వ్రాతలు గండపెండేరము వరిమిలానే జరిగినవట! ఇత్యాదులు కొన్ని చెత్తవ్రాతలు వ్రాసి నన్ను పరిహసించుచు నే నడిగి యత్నించి ప్రార్థించి సన్మానాలు పొందినా ననియు, తానట్లు చేయలేదనియు పైవారి వ్రాతలు సరియైనవనియు, వారిని సపోర్టు చేసినారు. నే నా వ్రాతలం బురస్కరించుకొని దేనికిని సమాధాన మీయక నిరసించితిని. నాసన్మానములం గూర్చియెవరెట్లువ్రాసినను వ్రాయుదురుగాక, అందలి సత్యాసత్యములకు లోకమును దైవమే ప్రమాణము. అయినను నాసన్మానములం గూర్చి యించుక నివేదించుకొనుట ప్రస్తుతము కాకపోదు.

— నాసన్మానములు —

కవిరాజబిరుదము:—ఇది కళ్ళికోట రాజాహరిహార మర్దరాజ దేవుబహద్దరుగారి వివాహామునకు ప్రభుసమ్మానితుడనై వారి పరివారముతో బంగాళారాజధానియందలి మయూర భంజిపురమునకుఁ బోయి యున్నయప్పుడు అట రామచంద్రశాస్త్రి ప్రభృతి మహాపండితుల సమక్షమున సంస్కృతముతో నవధానము చేసితిని. "అప్పుడు ఆ ప్రభువులు "కవిరాజ" బిరుదముతో నొక స్వర్ణపదకము నొసంగి సన్మానించిరి. ఇందు నాయాచన యెంతయుండునో పాఠకమహాశయులే నిశ్చయింతురుగాక !

కవిసార్వభౌమ బిరుదము;—శ్రీరామపురంబున నేను కృతి యిచ్చిన సందర్భమున కృతిపతులచే నాహూతుడనై యటకు ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారు, న్యాపతి సుబ్బారావు పంతులుగారును దయచేసి యగ్రాసనాధిపత్యము వహించి యున్నప్పుడు లక్ష్మీనరసింహం పంతులుగారు నాకు కవిసార్వభౌమబిరుదమిచ్చుటకు నొక రిజల్యూషన్ పెట్టి తాము ప్రపోజు చేసినారు. దానిని సుబ్బారావుపంతులు

గారు బలపఱచినారు. సభలలోగల పండితులు, లౌకికోద్యోగస్థులు లోనగువా రెల్లరును ఏకగ్రీవముగా నామోదించినారు. నాకపుడు సబహుమానముగా "కవిసార్వభౌమ" బిరుద మొసంగబడినది. ఇందు నేనెంతయాచించితినో లక్ష్మీనరిసింహముపంతులుగారును, సుబ్బారావుపంతులుగారును తక్కినపండితులు రామగోవిందశాస్త్రిప్రభృతులును, పాలకొల్లు పురవాస్తవ్యులును సాక్ష్యమియ్యఁగలరు. పిమ్మట బెజవాడలో ఆంధ్రమహాసభ కడపవాస్తవ్యులు కోటిరెడ్డిగారి యాధిపత్యమున జరిగినది. ఆసభలో ఉయ్యూరురాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరు వారు విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు లోనగువారు కొన్ని వేలమంది కలరు. ఆ నిండోలగంబున సన్మానపత్రసహిత రజతపేటికతో దుస్సేలువులతో పాలకొల్లులో మున్నిచ్చిన కవిసార్వభౌమబిరుదమే వారును దయచేసి నన్ను గౌరవించినారు ఆసభలో నేనెందఱికాళ్ళకడుపులు పట్టుకొని దేవురించితినో యెవరేని చెప్పుదురేమో చూతముగాక. దీనిం గూర్చి బందరులోనగు పురములలో అభినందన సభలు జరిగినవి. దానికి నాప్రోత్సాహ మెంతకలదో వారును సాక్ష్యమిత్తురు.

స్వర్ణాభిషేకము;— శ్రీరామపురిలో నాకు మిత్రులై నా భారతసంపుటములు కృతినొందిన రేపాక సత్యనారాయణమూర్తిగారు చుండూరి నారాయణరావుగారును చెరియొక వేయిరూప్యములను పెట్టి స్వర్ణపుష్పములు చేయించి ముక్కోటియేకాదశి దినమున వేదశాస్త్రపండితులు, ఆమ్నాయవాచస్పతి వడలి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రభృతులచే గంగ, కావేరి, గౌతమి, కృష్ణవేణి సముద్రజలములం దెప్పించి స్వర్ణపుష్పములందు మంత్రపూతములు గావించి మృత్తికాస్నానసర్వప్రాయశ్చిత్తాదులైన వెనుక సామ్రాజ్యపట్టాభిషేకమంత్రములతో నాశిరంబున ఆస్వర్ణజలంబభిషేకించినారు! కృతిపతులిద్దఱును

వారికి గలసంతోషముతో నిట్లు చేయించినారు. అస్వర్ణమంతయు బ్రాహ్మణవినియోగము చేయబడినది. ఇందులో లోకామోద మున్నను లేకున్నను కృతిపతుల యానందమే ప్రధానమైనది. ఆసభకు బహుదేశములనుండి మహామహులగు పండితులు పెక్కుమంది వచ్చి న న్నభినందించినారు.

కవిగండపెండేరము — రాజమహేంద్రవరములో సుప్రసిద్ధధనికులును జమీందారులుఅగు శ్రీముత్తంగిసీతారామయ్యగారు నాకుగండపెండేరమువేయించవలయునని యెంచి శ్రీగౌతమీగ్రంథాలయసభ్యుల, సమక్షమున నొకతీర్మానము పెట్టి రిజల్యూషన్ వ్రాసుచేసినంత కొంత ద్రవ్యము లైబ్రరీవారు సమకూర్చినారు. కడప, నెల్లూరు, మదరాసు, బెజవాడ, విశాఖపట్టణము, రాజమహేంద్రవరము లోనగు పురములనుండి మహాజనులచే సుమారు రెండువేల సమ్మతులు సేకరింపబడిన పై బెజవాడ వేంకటస్వామినాయడుగారు మందపాటి సీతారామచంద్రరాజుగారు మొదలగువారియొక్క ద్రవ్యసహాయమువలన శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి యధ్యక్షతతో 5, 6 వేలమంది క్రిక్కిరిసియున్న మహాసభలో మహావైభవమున గండపెండేరము నా కాలికి వెంకటశాస్త్రిగారు దొడిగినారు. ఆకాలమున ఆర్యాపురము నందలి సంస్కృతపాఠశాలవారు తమపాఠశాలలో సభచేసి యొక సన్మానపత్రిమొసంగిరి. పెక్కుపురంబులలో నభినందనసభలు జరిగినవి అందు నాప్రోత్సాహ ప్రార్థనంబులు ఎంతవరకున్నవో కాళ్ళుకడుపులు పట్టుకొనుట ఎంతవరకున్నదో ముత్తంగి సీతారామయ్యగారును, గౌతమీలైబ్రరీవారును చెప్పగలరు. సభాధిపత్యమువహించి గండపెండేర మొసంగుమని నే నెంతప్రార్థించితినో వెంకటశాస్త్రిగారే సాక్ష్యమియ్య గలరు.

జన్మదినోత్సవములు — ఒకటి రెండుసంవత్సరములు భమిడి

పాటి కామేశ్వరశాస్త్రిలుగారి ప్రోత్సాహమున బెజవాడ వేంకటస్వామి నాయడుగారు, చేకుమళ్ళ అచ్యుతరావుపంతులుగారు లోనగువారి యాధిపత్యములతో నా జన్మదినమున సభలుచేసినారు. అట్లు సభలు చేయుటలోక యుత్సవము కాదని నేను నిర్ణయించుకొని నాస్వంతద్ర వ్యముతో నాపుట్టినదినమున కొంతమంది విద్వాంసులు లోనగువారింబిలి చినాశక్తి కొలది సన్మానించి భోజనములు పెట్టి టీపార్టీలుచేసి ఆనాడు సంతోషముతో కాలక్షేపము చేయుచున్నాను. మొన్నటి సప్తది జన్మ దినోత్సవమునకు ౬ వందలరూపాయలు ఖర్చుపెట్టితిని. ఇది తప్పని పెద్దలకు తోచి నన్ను శాసించినయెడల మానుకొందును.

## దుర్వాక్యములు

ఇట్టివిషయములో సంగతిసందర్భము లెరుంగక యెవ్వరో వ్రా సినవ్రాతలం బురస్కరించుకొని మిమ్ముగూర్చి వ్రాసినవారు లోక లూకాయలు కారనియు వారివ్రాతలు ఖండించుటకు అవకాశము లేదనియు మనచంకదుద్దుశరణార్థిగారు శాంతివ్యాసములో వ్రాసినా మనిరి. ఆవ్రాతలకు నిరుత్తరమే సమాధానమని నేను వారికళ్ళనీళ్ళు తుడిచి యోదార్చినానట. ఆదుఃఖమిప్పటికి వారిని బాధిస్తూనేయున్న దట. అది చల్లారునదికాదు. నిరంతరమును వారిని బాధించునదియే యని నానిశ్చయము. "తమతో మనవిచేసి ఇకముందైనా ఇట్టి ప్రయత్నాలు చేయకండి మహారాజా అని బతిమాలుకుందామంటే తాముదానిని ఓర్వలేమిగా భావిస్తారు. అంగీకరిస్తారా" అని వ్రాసి నారు. ఇట్టిప్రయత్నాలనగా నేను వారికాళ్లును వీరికాళ్ళును పట్టుకొని సన్మానములుపొందుటకు చేయుపనులు. అవిచేయకండి మహారాజాఅని మొత్తుపెట్టవలసిన యవసరమేమియో! బ్రతిమాలుకోవలసిన యవసర మేమియో; నాకప్రతిష్ఠ వచ్చుననియు నాకువచ్చు నప్రతిష్ఠ తమకు వచ్చినట్లేయనియు నభిప్రాయమును సూచించుటకు గాబోలు నీవ్రాత.

పాపం వారికి నాయెడల నెంతప్రేమయో! సవతితల్లిప్రేమ. అట్లు బతిమాలుట నిజమైనయెడల నది యోర్వలేమిగా నే నేలభావింతును నే చేసినప్రయత్నములు నిష్ఫలములైనప్పుడు చేయకండి 'మహారాజా' అన్న నేనంగీకరింతునేమో! ప్రయత్నములు ఫలించుచున్నపుడు చేయకుడని బతిమాలుటయెట్టిదో తెలియదు. నేఁజేయకుండుట యెట్టిదో తెలియదు. "ఓర్వలేమిగా భావింతు" రని వారు వ్రాయుటచేతనే వారి యీ బతిమాలుటంతయు ఓర్వలేమియనియే స్పష్టపడుచున్నది. ఇంతఓర్వలేమిగలవారు గనుకనే నన్ను దూషించువారికి తాము చేదోడువాదోడై పాడువ్రాతలువ్రాసి గురువుగారు గురువుగారను కొంపతీతలు నేర్చి తుదకు చంకదుడ్డుచరణార్థులైరనియు వారి కిపుడు అసూయాగ్రహ మావహించినదనియు చెప్పక తప్పదు. గ్రహావిష్టులగు వీరిపుడు నన్నే కాదు తమకు తోడునీడయై తమప్రతిష్ఠకు కారణభూతులై పరమపదించిన సహాధ్యాయులగు తిరుపతిశాస్త్రిగారినికూడ దివాకరాస్తమయమనుపుస్తకము వ్రాసి అందు తమచమత్కారమంతయు తేటపడ నిరసించినారు. "తల్లి చెవులు తెగ్రించినవారికి పినతల్లి చెవులు బీరపువ్వులునుగావు" ఇట్టిచో వారికంటికి నలుసువంటి నే నేలెక్కలోనివాడను? తమకు సంబంధింపకున్నపుడు పిలువనిపేరంటముగావచ్చి శాంతివ్యాసము వ్రాసియు, నాకర్మమున నేఁ బోపుచున్నప్పుడు పరులవ్రాతలకుపబలముగా స్వార్థపరుడై "ఇకముందైనా ఇట్టిప్రయత్నాలుచేయకండి మహారాజా" అని వ్రాసియు నహామికందాల్చిన మన చంకదుడ్డుశరణార్థివంటివారు గాక ఒకడు తదంత తా నేదో పత్రికలలో వ్రాసికొనుచుండగా నెంతవెఱ్ఱిడైన వానికడ్డువచ్చునా? తమచరిత్రకుగలిగిన విరోధము నపహరించుకొనువిషయములో నే నడ్డువచ్చుటకు నాకేమియధికారముండెను. నే నేలయడ్డవత్తును. నే నేమో తమ్ము దూషించితినని భ్రమపడి నా పేరెత్తుకొని నన్ను నిందించి మూడు వారములు పత్రి

కలలో వ్రాయుటచేత శాంతిగోరి "ఇట్టివ్రాతలు వ్రాయకుము నగు బాట్లపాలుగాకుము" అని హితబోధచేసితిని. ఇది తప్పా! తప్పన్న చో వారియిష్టమువచ్చినట్లు త్రవ్వుకోవచ్చును పూడ్చుకోవచ్చును. నా బిరుదములు నేనెట్లో కష్టపడి యేయొరులనుండియో సంపాదించి తినే యనుకొనుడు. ఆబిరుదములు చేవ్రాలు చేయునప్పుడు ఉపయో గించుకోవచ్చునని నాకు తోపలేదు. పట్టుపగలు జోడు కంచుకాగ డాలు వేయించుకొని వెళ్లు నొకసెట్టిని "నీ కెవరిచ్చినా రీబిరుదము" లని ప్రజలడుగగా నాయామదువు చేసిచ్చినదని యనెనట. అట్లే వీ రితరుల నాశ్రయించి కష్టపడకుండ తమంతటతామే తగిలించుకొన్న కింకపిందార్లిదిబిరుదము లిట్టిపట్ల నుపయోగింతురా? ఉపయోగింపరాదు కాదు కాదు. వీరుపయోగింతురు చూడుడు. 'శతావధాని చెళ్ళపిళ్ళ' యని చేవ్రాలు చేయుదురు. ప్రియవాది యని క్రొత్తబిరుదు సంపా దించితినట. ఆగ్రహావిష్టుని కలమున కడ్డేమి? పాపము వారు "అప్రియ త్నము చేయకండి యీ ప్రయత్నము చేయకండి" అని బోధించుచు న్నారై యిట్లు తంటాలుపడుచునే యున్నారు. వారిమాటలు వినిపించు కొనుట లేదని నేనే విచారించుచున్నాను. మఱియొక్కమాట మనవి చేసెదను. కొందరు యథాలాభముగా శిలావిగ్రహప్రశంస చేసినారు. కాని తత్ప్రయత్నమే లేదు. ఏమియులేదు. అంతలోనే చంకదుద్దుగారు దుద్దుతీసినారు. ఇది వారు చేయందగిన పనియే. ఈవిషయమున మాటవరుసకు నాశిలావిగ్రహప్రతిష్ఠకు నేనే ప్రయత్నించుచున్నానని యొప్పుకొందును వినుడు లోకములో నావంటిపిచ్చివాడు ఇన్ని కోట్లజీవరాసులలో తనపేరేమి? ప్రతిష్ఠయేమి? తా నేలెక్కలోనివాని వాడనని విచారింపక తానొక ఫోటోతీయించుకొనుటకు ప్రయత్నించు చును. మంచిబట్టలు కట్టుకొని తనకులేకున్న నెటనైన నొకకోటు సంపా దించి తొడుగుకొని మెరవు తెచ్చియైన కొన్నినగలు పెట్టుకొని తన

ఫోటోతీయించుకొని దానికి మంచిఫ్రేమ్ కట్టించితనయింటిలో పెట్టుకొని చూచి యానందించును. దానికి నెన్లార్జిమెంటుచేయించును. మఱి యొకడు ఆయల్ పెయింటింగు చేయించుకొనును. ఇది లోకములో నప్రతిష్ఠ తెచ్చుకొనునది యని మనకవిగారియభిప్రాయము కాబోలు. తామట్టిపని యెప్పుడును చేయరు. చేసికొన్నవారిని సహింపరు; వారి బొమ్మ మెచ్చుటను లేనేలేదు. కనుకనే నేను తంటాలుపడి వారికాళ్లు వీరికాళ్ళు పట్టుకొని శిలావిగ్రహము చేయించుకొని నాయింటిలో నిలుపుకొనుట అప్రతిష్ఠకు కారణ మని నాకు బోధించుచు పెద్దవ్రాతలు వ్రాసినారు. పాపము! వారు నాకు చెప్పవలసినంతవఱకు చెప్పినారు. కాని నేను వినిపించుకోకున్నప్పుడు పోనీ వారి కర్మమని యూఱకుందురు. ఇది సజ్జనలక్షణము.

వారిబిరుదములు.

"నే నొకబిరుదానికి ప్రయత్నించడంలేదు. శిలావిగ్రహస్థాపనకై ప్రయత్నించడం లేదు. నా జన్మదినోత్సవం చేస్తారా? చేయరా! అని యెవ్వరిని యాచించడంలేదు" అని వ్రాసికొన్నారు. పై విషయములలో నాప్రయత్నములు కొంచెమును లేవని మనవిచేసికొనియే యున్నాను. ఇట్టి చోప్రజ లెట్లూహించినను సమ్మతమే. శ్రీ శ్రీవారు నిర్లేపులు, నిస్పృహులు, నిరహంకారులు, నిరాడంబరులు, నిరాశులు, నిగర్వులు. వారెప్పుడును నేను ప్రయత్నించినట్లు బిరుదాలకు ప్రయత్నింపరు. "కింకవీంద్ర ఘటాపంచానన, విద్వత్కవి, బాలకళానిధి, బాలసరస్వతి, శతావధాని" ఇవి వారిబిరుదములు. ఇవి యెవ్వరిని నాశ్రయింపక యాచింపకయే వచ్చినవి. ఆలోచించి మంచిముహూర్తములో వారే పెట్టుకొన్నారని మన మనవచ్చునా? వీరాశ్రయించిన, నాశ్రయింపకున్న, యాచించిన, యాచింపకున్న, వీని నితరులే యిచ్చినారని మన మనుకోక తప్పదు. వీరు నిస్పృహులే కావున నాబిరుదములు తగిలించు

కొనుట యెట్టిదో తెలియదు. అయాచితముగా వచ్చిన గౌరవమును స్వీకరించినామని చెప్పుదురేమో? నాబిరుదులం గూర్చియు నాసన్మానములం గూర్చియు నట్టియని వీ రూహింపక పరిహసించుటయేమో? గురివిందపూస తనకున్న నలుపు తా నెరుంగకున్నట్లు వీరు ప్రవర్తించుచున్నారనక తప్పదు. అప్రతిష్ఠవచ్చునని "ఇట్టిప్రయత్నాలు చేయకండి మహారాజా!" అని వీరు నన్నవచ్చును. దానికి నా కంగీకారమే కాని—కింకవీంద్రఘటాపంచానన —కింకవీంద్రులు= శ్రేష్ఠార్థకవాచకమైన ఇంద్రశబ్ద మున్నపుడు వారిని కుకవులనుట తగదు. కవులు కుకవులగుదురు. కాకవులగుదురు. కింకవులగుదురు. కవీంద్రులు కారు. ఘటా=సమూహము ఏనికగుంపు; ఘటము=కుండ; పంచానన=విస్తృతమైనమొగముగలది (సింహము) ఆపంచ=అంతటను తెఱచిన; ఆనన=నోరు; కింకవీంద్ర ఘటాపంచానన=కింకవీంద్రులకడ కుండ (బాన) వలె అంతటను తెఱచిన నోరుగలవాడు) ఉత్తరము చెప్పలేక నోరు వెళ్ళబెట్టాడు ఇత్యాది) అని నిందార్థము స్ఫురించుచున్నది. బాలకళానిధి బాలసరస్వతి, చిన్నతనపు చిహ్నములు. బాలసరస్వతి=క్షుద్రనది, అని నిందార్థమును. మఱియు పురుషులకు ఆడుదానిపేరు, అనగా స్త్రీనామము పెట్టుకొనరాదనియు, స్త్రీనామధారియైన పురుషుడు శ్మశానవృక్షమై పుట్టుననియు ధర్మశాస్త్రములు ఘోషించుచున్నవి. "బాలసరస్వతులబోలు ప్రాజ్ఞులుగలరే" అని యప్పకవి చెప్పినాడు. బాలసరస్వతీనాములుకొందఱున్నారని సమాధానము చెప్పవత్తురేమో, వారికర్మము వారిది. మన కర్మము మనది. ధర్మశాస్త్రధర్మమిది. శతావధాని=ఈబిరుదము కూడ ఇప్పుడు పొసగదు. అప్పుడైక వీరు నూర్గురి కవధానము చేసిరో లేదో. తిరుపతి వెంకటేశ్వరు లిరువురును, సాయమువట్టి 2, 3, 4, 5, 6, 7, 8, దినములలో 10, 20, 30, 40, 50, 60, ఇట్లుపూర్తిచేసినవియై యున్నవి. ఆయవధానములలో నెప్పుడో చెప్పినపద్యములుగూడనప్పుడు

చేర్చు నాచారముకలవారైరెనట్లు కాకినాడ యవధానములోని "ఏనాం మమూర్తాం కృతిభాసమానాం" అనుపద్యము సాక్ష్యమిచ్చుచున్నది. కావున పై బిరుదములు తగిలించుకొన్న వీరు పరిహాసపాత్రులగుదురు. 'వానిం దగుల్చుకొనకు, మహాపండితా!' అని నే నిట వ్రాయవచ్చునా వ్రాయరాదు. వ్రాయను. వారే ఆలోచించుకొని మానుకొనుట మంచిది. అని మాత్రము చెప్పుచున్నాను.

## —: బాలబిభీషికలు. :—

"బాలసరస్వతి గారిక్రింద నొక బాలబిభీషిక నుటంకించినారు. ఏమో నన్నుగూర్చి యిటీవలిచర్యలో విస్తరించి వ్రాసితి మనియు దానిని పత్రికవారు ముద్రింపకున్న పుస్తకముగా ముద్రించి ప్రకటింపక మాననని నన్ను బెదరించుచున్నారు. బెదరింపనక్కరలేదు. నాయటూవలిచర్యలో దానిం దునాతునియలుచేసి నాకును ప్రెస్సు గలదు. కాన నేనును దాని తాతపుస్తకము ప్రకటింపగలనని యెఱుంగుదురు గాక. హైదరాబాదుపత్త్రములో గాని శృంఖలములోగాని వారినికృతఘ్నులని పొరపాటునైన వ్రాయలేదు. ఎవరో వ్రాసిన జాబులోనిమాటలు పాటింపవల దని నే నంటిని. అది యెఱుగునంతశక్తి లేక నేనే వ్రాసితినని శతావధానిగారు మఱియు, మఱియు నుటంకించుచున్నారు. శృంఖలము నేను మనస్ఫూర్తిగా వ్రాసినాను. అందు నాతొందరపాటు లవమైనను లేదు. దుష్టాభిప్రాయ మిచ్చినమాకవిగారిదే తొందరపాటు. ఇంతవఱకు శృంఖలగ్రంథము, ఏరావుసాహెబువద్దను, దొరకదుకాని పది పదియైదు దినములలో వారియింటిలోనే దొరకును. అదిచూచి వారు సంతోషింతురుగాక. దానిపై వారు చేతనయినపని చేయుదురుగాక. తేగల పాతరవలె పెచ్చుపెరిగిన స్కూలు శిష్యులుపెక్కురు నాకులేని మాట నిజమే. స్వల్పముగానే యున్నారు. వాండ్రయినను వీరుచెప్పినట్లు జట్టీలు తెచ్చు పుచ్చు శిష్యులే. వాండ్రను నేనిపుడు నలుగురిలో పెట్టి

తలవాయగొట్టుటకే ప్రయత్నించుచున్నాను. "నేను నిక్కంపు శిష్యుడను...నావంటిభక్తిగల శిష్యులులేరు. నాశిష్యత్వంవలన తమకు వచ్చే గౌరవం లేదన్నారు. అదిచూచి పరమాశ్చర్యం పడ్డాను" అని వారువ్రాసినది సరియే. నాకువచ్చే గౌరవములేదని వ్రాయుట నాది తప్పే. వారి వంటి వారుండబట్టియే నాగౌరవము నేను కాపాడుకోగలుగుచున్నాను. చూడుడు నావిషయమై జలతాడనము వ్రాసినారు శాంతివ్యాసము వ్రాసినారు. మీపై వ్రాసినవారు లాకలూకాయలుకారు, వారివ్రాతలు సమర్థింపలేము. మీరు నోరుమూసికొని యుండుడని నాకుబోధించినారు. వనంవారి విషయములో ధర్మస్వరూపులు మెచ్చునట్టి శిష్టసంప్రదాయాభిప్రాయ మిచ్చినారు. మీరు సత్కారమును పొందుటకు ప్రయత్నించుట తగదని తెలియజెప్పినారు. నాశుశ్రూష, నాముక్త్యాల ప్రయాణము, నాపాలకొల్లుప్రయాణము శాస్త్రిగారి క్షమాపణ అని లోకాతీతవ్యాసములు వ్రాసినారు. ఇపుడీచంకదుడ్డుశరణార్థివ్యాసమపారము చేసినారు. ఇత్యాదులు చెప్పలేను. అనేకములు చేసి, చేయుచు నాగౌరవమును కాపాడుచున్నారనుటకు పంచభూతములును సాక్షులగుచున్నవి.

—♦ నా భారతప్రశంస ♦—

ఇంతతోఁ దృప్తినొందక నాభారతముపైకి దుమికినారు. ఎప్పుడో కృష్ణాపత్రిక 'నే నూరక గణబద్ధము చేయుదు' నని వాకొన్నదానిం బురస్కరించుకొని "మీభారతమును నిరసించేవారి కీలాటిచోట్లు పూర్తిగా తోడ్పడతాయి" అని యీక్రిందిపద్య ముదాహరించినారు.

"కం. స్త్రీస్వాతంత్ర్యము లేమిన్
మాస్వాములవారు వచ్చి మసలక నీకుం
సుస్వాదు వృత్తి నిచ్చిన
నోస్వారాడ్తుల్య! నన్ను నొందుము పిదపన్"

ఇది యూరక గణబద్ధము చేసిన పద్యమని శరణార్థిగారికి తోఁచి యుదాహరించినారు. ఇం దీపదము వ్యర్థము. ఊరక గణబద్ధమని వ్రాయలేదు. వ్రాయకున్న నిటమూల మెట్లున్నదో చూచి యేది గణబద్ధమో? యేదిపడికట్టుఆాయో? విచారింతము. ఇది శకుంతలా దుష్యంత సంవాద ఘట్టము. ఆదిపర్వము—

"శ్లో. గాంధర్వేణ చ మాంభీరు వివాహే నైహి సుందరి!"

దుష్యంతుడు శకుంతలంగాంచి ఓ భయశీలురాలా? గాంధర్వ వివాహమున నన్నుఁ బొందుము. అనిన జంకుచు శకుంతల—

"శ్లో. ఫలాహారీ గతో రాజన్ పితా మే ఇత ఆశ్రిమాత్
ముహూర్తం సంప్రతీక్షస్వ స మాంతుభ్యం ప్రదాస్యతి"

అనుటకు నాభారతములో "స్త్రీస్వాతంత్ర్యము" అనుపద్యము వ్రాసితిని. అట్లు శకుంతల పలుకగా రాజు గాంధర్వవివాహధర్మ మీమె తెలియదనియు, తండ్రివచ్చి తన్నిచ్చిన గ్రహించుమని చెప్పుచున్నదనియు విశ్చయించుకొని,

"శ్లో. ఆత్మనోబంధు రాత్మైవ గతి రాత్మైవ చాత్మనః
ఆత్మనై వాత్మనో దానం కర్తు మర్హసి ధర్మతః"

గాంధర్వమున తనను దానే గతియు చుట్టమును గావున నీవే నిన్ను దానముచేసికొనుట ధర్మవిరుద్ధము కాదనెను. దుష్యంతుడు వివాహమాడి చనిన పిమ్మట కణ్వుడు వచ్చి భయపడుచున్న శకుంతలం జూచి—

"శ్లో. త్వయాద్యభద్రే రహసి మామనాదృత్యయః కృతః పుంసానహ
సమాయోగో నస ధర్మోపఘాతుకః"

నన్ను గాదని నీవు రహస్యముగా జేసినకార్యము ధర్మోపఘాతకము గాదు అనెను. ఇట్లున్న సందర్భమున నేను జెప్పిన "స్త్రీస్వాతంత్ర్యము లేమిన్" అనుపద్యములో కేవలగణబద్ధముగా నుపయోగిం

చిన పదములేవో విచారింపనగు "స్త్రీస్వాతంత్ర్యము లేమిన్" ఇది మూలములో లేదు. నీవు వ్రాసితివి. గణబద్ధము కాదా? అందు లేని రాజుకోరగా శకుంతల యేటికిభయపడి తండ్రివచ్చి యిచ్చిన స్వీకరింపుమనెనో? రాజు గాంధర్వమున తనకు దానే దాతగాని యన్యులు కారని యేటికి చెప్పెనో? పిమ్మట కణ్వుఁడు నన్ను సరకుగొనక నీవు చేసినకార్యము ధర్మహానికరమైనది కాదనెనో? బుద్ధిగలవాడు కొంచెము విచారించినచో స్త్రీకి స్వాతంత్ర్యము లేమినట్లు శకుంతల భయపడెనని తెలియక మానదు. కావున సేనావిషయము వాచ్యముచేసి చెప్పితిని. మూలాభిప్రాయమును వ్యక్తీకరించుటకే శ్రీకృష్ణభారతము పుట్టినది గాని మక్కికి మక్కిగా దిక్కుమాలినధోరణిని జెప్పునదికాదు. కావున నిట ఇది యత్యావసరవాక్యమే యని యెఱుంగుదురుగాక.

"మాస్వాములవారు—నాతండ్రియని మూలమందున్నది. కాని సామాన్యమైన తండ్రి యనినప్పుడు రాజు లక్ష్యపెట్టక బలవంత పెట్టి తన్నంటునో ధర్మహాని యగునో యను భయంబున రాజునకుఁ గూడ తనకున్నభయమే పుట్టుననియు, కణ్వుఁడు వచ్చుదనుక వేచి యుండుననియు నభిప్రాయసూచకంబుగా మహర్షి పర్యాయబోధకంబగు నీపదము ప్రయోగించితిని. ఇది మంచిపద మని పండితలోకమనదా?

"మసలక"యిది పడికట్టుఱాయందురా? కాదు "ముహూర్తం సంప్రతీక్షస్వ" ఆలస్యము చేయక వారు వచ్చి నీకిత్తురు క్షణము వేచి యుండు మని బోధించుచున్నది. నన్నయభట్టారకులును "ఇంతకు జనుదెంతురు" అనిరి. కావున నిది గణబద్ధమునకు నోరాడ గూడ దెవ్వరికిని.

సుస్వాదువృత్తి—స్వాదు—ఇంపగు, నిర్మలమయిన; వృత్తి—నడవడిక, మనోవ్యాపారము; అనగా నత్యంత నిర్మలమయిన వృత్తితో

మీ కిత్తురు. ఇట భట్టారకులును "కరుణానిరతులు, ధర్మస్వరూపులు" అని వ్రాసియున్నారు. దానియభిప్రాయము నిదియే. కావున నిది పాదపూరణము కాదని తెలియునది.

స్వారాట్తుల్య=ఇంద్రసముడా! అని రాజును సంబోధించుట. మూలములో 'రాజన్' అనియున్నది. ఇది దానికన్న మంచిదని నాయభిప్రాయము. కాదందురా? వీరందురు. అనుగాక, పండితలోక మనునా?

వచ్చి, నన్ను, నొందుము, పిదపన్—ఇవి మనకు కావలసిన దగ్గర చుట్టములే. ఇట్లున్న యిందు వ్యర్థపద మొక్కటియు కన్నుగలవారికి కానుపించుట లేదు. వీరికి కానుపించుచున్నదేమో? మూలము నందలి ప్రక్రియ మెఱింగినవానికి మాత్రము కానిపింపదు. ఇటిస్థితిలో మనవిమర్శకుడుగారు వారిగీరతమును మహాగ్రంథమని నే నంటిననియు అట్లనుట నిరసించుట యనియు నెంచి నాభారతమును విమర్శింపంబూని నారు. కాని మొందులకుం బనికిమాలిన గీరతమును మహాగ్రంథ మనుట నిరసించుట గాక మఱియేమగును? ఇట వారుపడిన యభిప్రా యము సరియైనదే యని నేను నాతప్పు దిద్దుకొనుచున్నాను. "ప్రక టింపంబడు మంచి చెడ్డ యనుచున్ వ్రాకుచ్చి చర్చింప" అనునట్లు మా బాలసరస్వతిగారు నాయందు భక్తిగలవార మని చెప్పుచున్నారు. కావున నితరములగు తుచ్ఛవిషయములవిడచి నాభారతమునే విమర్శించి నాలోపములు వెల్లడించెదరుగాక. నేను చేతనైనచో సమాధా నము చెప్పెదను. లేదా నా తప్పే యని యొప్పుకొని సవరించు కొందును. పైనుదాహరించిన పద్యములో వారు సెలవిచ్చిన దోష మున్నదని పండితులగువారును భారతతత్త్వమెఱింగినవారును పలుక సాహసింపరు. ఇట్లవివేకముగా విమర్శించి వ్రాయువారిని సర్వమూ తోటకూరకట్టగా గాదు, మఱియొకకట్టగా గూడ నెంచి త్రోసివేయు టకన్న సాధనాంతరము లేదని మనవి చేయుచున్నాను.

మఱియొక విశేష మేమనగా—వీరు నాభారతముపై నొక సారెను రెండుసారులుగా మంచియభిప్రాయ మొసంగి "ఇది కేవలము నాయభిప్రాయమే ,కాక మాతిరుపతి శాస్త్రి యభిప్రాయము" నని వ్రాసియున్నారు. అవ్రాతకీవ్రాఁతవ్యతిరేకమైనస్వవచనవ్యాఘాతదోషము పట్టునను భయంబున అన్యాపదేశముగా గ్రంథములపై నభిప్రాయము లిచ్చిపుచ్చుకొనువారిం బేర్కొనుచు "పెద్దపెద్ద గ్రంథములు పోస్టేజి పెట్టుకొని ప పించినప్పుడు, ఆగ్రంథములు చెడ్డవయినను పండితులు మంచియభిప్రాయములియ్యక మానరు" అని చమత్కార మొలికించి నారు. అట్లే కావచ్చును. వీరిగ్రంథములపైనయిన యభిప్రాయము లన్నియు నిట్టివే యనియు మనమనవచ్చును. వీరు నాగ్రంథముపై రెండుసారు లభిప్రాయమిచ్చిరి. కావున నేను రెండుపుస్తకములు వారికి పంపించితినని యనవలసివచ్చును. శాస్త్రిగారి యభిప్రాయ మిట్టిది గనుకనే ఈనడుమ నెవ్వరో తమకొకపుస్తకము పంపగా దాక్షిణ్యము మాటకేమి పెద్దధనాశం బెట్టుకొని పొగడి పద్యములు వ్రాసి కృతార్థు లయిరని తెలియుచున్నది. శ్లోకపంచకనిరాకరణముపై వీరిచ్చిన పుచ్ఛ భిప్రాయముగూడ నాయూహను బలపఱచుచున్నది.

—♦ వారికవిత్వ ప్రభావము ♦—

వెంకటశాస్త్రిగా రవిమర్శముగా పైనుదాహరింపఁబడిన నా పద్య మూరక గణబద్ధమాత్రప్రయోజనము కలదని పలుకగలిగినారు ఇట్టివి గణబద్ధమాత్ర ప్రయోజకము లెప్పటికిని గావు. అట్టివి నిర ర్థక, నిరుపయోగ, నిస్సారము, లైనగ్రంథములు లోకమున లేకపో లేదు. అందొక్కపద్యముమాత్రము మచ్చునకిక్రింద నుదాహరించు చున్నాను. చిత్తగింపుడు. బొబ్బిలి పట్టాభిషేకము.

"ఉ. స్త్రీలను గూడ కొందరు పతివ్రత లొక్కక చిక్కునందు ని
ర్వేల మనీషవంశ మభివృద్ధికి రాఁదగునట్టి తంత్రముల్

పాలకసత్కుటుంబినులు పాడిగ జేయుట మున్ను వింటి మీ
శీలవతీలలామ మిటఁ జేసిన సత్కృతి కవ్వి లొచ్చగున్"

స్త్రీలను=ఆడువారిని, కూడ=సహితముగ; ఇట్లర్థము చెప్పిన పొసఁగుటలేదు. స్త్రీలను=స్త్రీలయందు; అనునర్థము చెప్పుకోవలయుఁగదా. ఈద్వితీయకు సప్తమ్యర్థము చెప్ప నొప్పదు. ఏకదేశపతితములు లేఖక ప్రమాదములున్న నవి నింద్యములే. జడవాచకమైనప్పుడే ద్వితీయకు సప్తమి చెప్పవచ్చును. ఇది జడవాచకము కాదు. స్త్రీ=మహత్యర్థకము. 'నిర్వేలమనీష' వేల=చెలియలికట్ట, పొలిమేర, అనాయాసమరణము, రోగము, ఈ యర్థములలో పొలిమేరను తీసికొని దానికి హద్దు అని యర్థము చెప్పుకోవలెను. ఇట హద్దులేని బుద్ధియని యర్థము కావచ్చును. హద్దుమాలినబుద్ధి యెట్టిచెడ్డ పనులనైన చేయించును, కావున నీపదము ప్రసస్థానమున తప్పుగా గణబద్ధమై పడినది పాడిగ =శర్మముగా ఇది నిరవసరము. యతికై న గణబద్ధము. ఇది గాక ప్రథమచరణమందు పతివ్రతలు "ఒక్కొక చిక్కునందు హద్దు లేనిబుద్ధితో వంశమభివృద్ధికి వచ్చునట్టి తంత్రములు అని పైని మూడవచరణములో, పాలక "సత్కుటుంబినులు" అని పతివ్రతలకు విశేషణముగా ప్రయోగిచుట దూరాన్వయ దోషము నాఁబడుం గాని సత్కవిత్వము నాబడదు. పతివ్రతాశబ్దము విడిచి పాలకసత్కుటుంబినీ శబ్దముగాని, దీనినివిడిచి పతివ్రతాశబ్దము గాని యున్న చాలును. ఇందొకశబ్దము నిరుపయోగమే. ఇదిగాక ఈపద్యమందు అన్యార్థమొకటి పొడగట్టుచున్నది. కొందఱు (పురుషులు) స్త్రీలను కలియుగా పతివ్రత లొక్కొక్క చిక్కులోబడి హద్దుమీరిన బుద్ధితో వంశాభివృద్ధికి (పిల్లనుగని వంశమభివృద్ధి నొందించుటకు) తంత్రములు చేయుటయు, దానిని పాలకసత్కుటుంబినులు న్యాయమే యందురనియు

దుష్టార్థము వెన్నంటే వచ్చుచున్నది. ఇట్టిపద్యములను కరికుక్కను గంగిగోవు చేసినట్లు పక్షాంపుక్షాము సమర్థించినట్లు మనవైయాకరణశిరోభూషణముగారు సమర్థింపగలరనుకొందును. వారిశక్తి యపారము. నేనింతవాడ నంతవాడనని వారెచెప్పుకొనియున్నారు గదా. కొండనంటించియమావాస్యను పూర్ణమాసిగాజేసినట్లు చేసినను తప్పు తప్పేకాని యొప్పెన్నటికిని కానేరదు.

## ఆత్మస్తవరాజము.

మఱియునిట మాచంకదుడ్డు శరణార్థిగారు 'నేనింతవాఁడను అంతవాఁడను నేనుదిగనేదిగను. దిగితే ఆసీమాంతముగ చేసిగాని విడువను. నిజమైనతప్పువుంటే కూడ మార్గాంతరముచేత సాధించగలను. ఏనామనూనా మన్నది. పక్షాపక్ష్యవాదము లోనగునవి. నాపొరపాట్లైనను సాధించాను. జయించాను. యీబలంనాకు వ్యాకరణశాస్త్రమున వచ్చినది. శంకరుఁడు పాశుపతాస్త్ర మిచ్చినట్లు బ్రహ్మయ్యశాస్త్రులుగారు వ్యాకరణశాస్త్రాన్ని దయచేసినారు. లేని యెడల నేనున్నా మీవంటి కవినేయగుదును' అని ఎన్నోస్వాతిశయ వాక్యములు వ్రాసి, తమ యహంభావమును కోటలుదాటించినారు. "తనకు దాను పొగడుకొన్న తన్నుకొన్నట్లేయుండును" అన్నసామెత లోకమునకుజ్ఞప్తికితెచ్చినారు. ఈఉత్తరకుమార ప్రజ్ఞలువిన్న విజ్ఞులెట్లుతలంతురో నేనిట వ్రాయనక్కరలేదు. వీరు భారతముచూచి యుండలేదేమో? అర్జునునకు తనగాండివమును విడిచిపెట్టు మన్నవారిని నరికివేయునట్టి ప్రతిజ్ఞయున్నది. కర్ణునిజంపక వచ్చితివని ధర్మరాజు నర్జును నట్లునోనాడినాడు. అప్పుడర్జునుడు ధర్మజుని తలందునుము కత్తినెత్తినాడు. కృష్ణుడడ్డువచ్చి వానిప్రతిజ్ఞ నెరిఁగి "మీయన్ననుతిరస్కరింపుము. నఱికినట్లైలె నీప్రతినకు భంగముకలిగింపదు." అనిన నర్జునుడట్లుచేసి, తద్దోషపరిహారార్థము తన్నుదా నఱకుకొనబోగా కృష్ణుడు "దీనికింబోల నాత్మస్తుతిం జేసి



కొమ్ము" అనిన తానపుడు ఏ నింతవాడనని ప్రాసి చేసితి. అంతేవాడ నట్లు చేసితి, నని మనకింకవిందరి ఘంటాపంచాననుడుగారు ఇపుడుచేసికొన్నట్లు ఆత్మస్తుతించేసికొన్నాడు. ఈకథవలన పరులను దూషించినచో వధించిన పాపమును, తన్నుదాస్తుతించుకొన్న నాత్మహత్య చేసికొన్న దోషమును ప్రాప్తించుననని తెలుచున్నది. ఇట మనశతావధానిగారి కీ రెండుపాతకములును ఒకేకాలమున సంప్రాప్త మైనందులకు మనమందర మును విచారింపవలసియున్నది. పాప మీవిషయములో వారేమిచేయ గలరు? లోపలియహంభావము దేహస్మృతిలేకుండ జేయుటచేత నిట్లుకల మాడినట్లు వ్రాసినారు గాని లేకున్న వ్రాయరు.

కవిలక్షణము.

"బ్రహ్మయ్యశాస్త్రిగారి శుశ్రూషకు నేను వెళ్ళకపోయేయెడల నేనున్నా, తమవంటికవినే యగుదును" అనివ్రాసినారు. నేను వ్యాకర ణముచదివితిని గాన నుత్తమకవినైతిని. మీరు చదువలేదుగాన నధమ కవు లయితిరని చెప్పుచున్నారుగదా? చెప్పనిండు. నేనధమాధమ కవి ననియే యొప్పుకొనుచున్నాను.

"కం॥ ధరణీసురుడు ప్రశాంతుడు
గురుభక్తుడు శుచియు కల్పకుడు పూర్వకవీ
శ్వర వాక్ప్రయోగ దక్షుడు
కరుణామతి యెవ్వడతడు కవియన బరగున్.

కం॥ శ్రుతిశాస్త్రాంగ పురాణ
ప్రతతియు నితిహాసకావ్య భరతాగమముల్
స్మృతి సంగీత రతికళా
గతుల నలంకృతుల నెఱుగగాదగు కవికిన్"

ధరణీసురుడు. శాంతుడు, గురుభక్తి కలవాడు, శుచియైనవాడు, కల్పనాశక్తి గలవాడు. కరుణగలవాడు, పూర్వకవులవాక్కులు ప్రయో

గించుటలో సమర్థుఁడు నయినవాఁడే కవియనిపించుకొనును. అట్టికవి — వేదములు, శాస్త్రములు, వేదాంగములు, (మీమాంసాదులు) పురాణములు, ఇతిహాసములు, భరతము, సంగీతము, ధర్మశాస్త్రము, రతిశాస్త్రము, అలంకారశాస్త్రము లోనగునవి నేర్చియుండవలెను. ఇట్టివాఁడే సుకవి యనిపించుకొనును. ఈచెప్పినలక్షణము లేవియునులేక వేదము రాక శ్రౌతస్మార్తఁములు తెలియక శుచిత్వమెరుగక, కరుణలేక, అంగములునేర్వక, పూర్వకవి వాక్ప్రయోగ దక్షుఁడుకాక, . పురాణములు చదువక, సంధ్యావందనమైననెఱుంగక, బ్రాహ్మణధర్మములు నిరసించి స్వేచ్ఛావిహారియై ఒక్కఁవ్యాకరణము రెండుముక్కఁలు నేర్చికొనినంత మాత్రమున రెండు భాగోతము పద్యాలల్ల గలిగినంతమాత్రమున, మనుష్యాధముడు సుకవి యనంబడడని సర్వశాస్త్రములును ఘోషించుచున్నవి. దీనినే రుజువుచేయుచు మన చెళ్ళపిళ్ళవారు తమబుద్ధచరిత్రములో:—

“చ॥ ఒకటియు రెండుపద్యముల కొక్కొఁక గ్రంథమటంచు, పేరు పె
ట్టుకొని మహాకవీంద్రులకు డొంకక మాకవనంబు చూడసా
ర్థఁక మనుకొంచు మాకుసరిరా రొరులంచును దమ్ము దాము మె
చ్చుకొనుచుఁ బొంగు వ్యాకరణశుంఠల కంఠము కట్టుటొప్పదే”

అని వ్రాసియున్నారు. (ఇది వీరువ్రాసినట్లులేక వీరివైరులు వ్రాసినట్లుండి సమన్వయించు చున్నది.) వీరి యభిప్రాయములో కేవల వ్యాకరణము చదివి కవిత్వము చెప్పువాడు “శుంఠ” యని తేలుచున్నది కదా! “నైవ వ్యాకరణజ్ఞమేతిపితరం” ! దీనింబట్టి విచారించినను కేవల వ్యాకరణజ్ఞానము గలిగియున్నను సుకవిత్వము రాబోదు. ఒకవేళ వచ్చినను భాగోతపు కవిత్వము పాగటివేషాలకవిత్వము బొమ్మలాటకవిత్వము వచ్చును. బమ్మెరపోతరాజేమియుం జదువకయే తన జన్మాంతర సంస్కారముచే సుకవియై హాయి హాయి యనిపించు కవిత్వ

మల్లఁగలిగినాఁడు. అన్నంభట్టారకాదు లెంత చచ్చి మొత్తుకొన్నను వారికి సుకవిత్వము రాలేదు. "కావ్యాలంకరణ జ్ఞమేవ కవితాకన్యా వృణీతేస్వయం" కావ్యాలంకరణజ్ఞునే కవితాకన్యవరించునను విషయ మనుభవజ్ఞులకే విశదము. ఈయన నాయొద్దఁ జదివిన రెండుముక్కలు తప్ప మాఘముగాని, నైషధముగాని, నాటకములుగాని, యలంకార ములుగాని, చదువలేదనియు, కవితావిషయమునుం జెప్పుకొనలేదనియు, వారేయొప్పుకొనుచున్నారు. వేదముగాని, శ్రౌతముగాని, స్మార్తము గాని, ఇతరశాస్త్రములుగాని, వారికిఁ దెలిసినట్లు ఎవ్వరికిని దెలియదు. కొంచెము వ్యాకరణముమాత్రము బ్రహ్మయ్యశాస్త్రిగారియొద్దఁ జదివి నట్లు తెలియుచున్నది.

## —♦ వీరి కవిత్వతత్త్వము ♦—

మరియు మా బాలసరస్వతిగారి కవిత్వముకడ నాకవిత్వ మధమ మని ముమ్మాటికి నే నంగీకరింతును. అయినను వీరి కవిత్వమునకు వీరిభాష్య మెంత మాత్రము నుపకరించినదో? గడ్డిపరకంత దాని యుప యోగము లేదు. మూలముమాత్రమే తెలుఁగు కవిత్వమున కుపయోగిం చును, ఆమూలమైన నంత యుపయోగమే యని నేనుజెప్పను. కొంత కొంతమాత్రము నుపయోగించును. కవికంతమాత్రము ముండితీరవలయును. అదియును లేనివాఁడు కవియనబడఁడు. వానికవిత్వము కవిత్వముగాదని చెప్పవచ్చును. నేను మా బాలసరస్వతిగారివలె భాష్యములో నాలుగు పంక్తులుపాడి శాస్త్రమంతయు దలకిందులు చేసినాఁడని చెప్పుచుండ లేదు. అని చెప్పుచునే యున్నాను. మూలముమాత్రమైన నేను జదువలేదని మన వైయాకరణశిరోభూషణముగారు సిద్ధాంతము చేయు చున్నారు. వారట్టిసిద్ధాంతము చేసినను జేయుదురుగాక. నేను నా కవిత్వమును సమర్థించుకొనుటకు శబ్దప్రావీణ్యము గలిగించుకొనుటకు నొరుల నాశ్రయింపనక్కఱలేదు. కావున వారి సిద్ధాంతములతో

నాకుఁ బనిలేదు. భాష్యము వారు కొంతపాడి మఱచి పోయినారు. నేను పాడనేలేదు రెండును సమానములే. తెలుగునకుఁ దెలుగువ్యాకరణముమాత్రము ముఖ్యమనక తప్పదు. అదియును బాగుగా తెలియక కోర్కెలు, ఉడికి యుడకక, అయితే కళ్లు చూపఱులు, చూచుక, లోనగు అపశబ్దములు కోటులు మేటులునుం గలియఁగూర్చి గద్దరించుచుండు వారున్నారు. అట్టివారే మేము మహానుభావుల మని గర్వించుచున్నారు. ఇతరులను గర్హించుచున్నారు. ఇది కాలమహిమగాని వారి ననవలసినపనిలేదు. మనశాస్త్రిగారు చెప్పుకొన్నట్లు వారికవిత్వము సర్వోత్తమ మనుటకు కారణములు లేకపోలేదు. వారి తెలుగులనడుమ కొన్నికొన్ని భాష్యపుపంక్తులు పడవేయుచు దాని ముక్కు 'ఇకోయణచి' వలె నున్నదని వర్ణింతురు. అట్టి వర్ణనావిశేషముండుటచేతనే గొడ్లకాపువాడు మొదలుకొని గొల్లవానివఱకును తేటతెల్లమై మనోహర మగుచుండును. వీరికవిత్వములో గ్రామ్యము గ్రాంధికమును తూచివేసినట్లుండును. వీరు భాష్యాదులకు శాంతి చెప్పిన వారు గావున తెలుగువ్యాకరణ మంతగా పాటింపరు. దాసంజేసియే నాకవిత్వముకంటె వారికవిత్వము వేయిమడుంగు లెచ్చని నుచ్చ్పటించుకొనుటకు వీలు కలిగినది. ఏకాలమునాటికి నెవ్వరికిని నాకవిత్వమువంటి ఛాందసకవిత్వ మలవడగూడ దనియే కోరి యీశ్వరుని ప్రార్థింతును. మనకవిచంద్రుడుగారు శ్రీరామమెత్తుకొని సభలలో నానాటక సంవర్ణనములోని పద్యములు చదువుచు నుపన్యాసము చేయునప్పుడు సభయంతయు వింజమాకిడినట్లుండును. ఇది వీరి పూర్వపుణ్యవిశేషము. వీ రీ సందర్భమున చెప్పినదేచెప్పి చెప్పినదేచెప్పి పత్రిక నిండించినారు. నేను వారిని కృతఘ్నులనికాని ద్రోహులనికాని యిదివరలో ననలేదని విన్నవించినను నావిన్నప మాలింపక గుమ్మడికాయలదొంగయన్న భుజముదడువుకొనినట్లు మాటిమాటికి "నన్ను మీరు కృతఘ్నుడ

యున్నారు. నాకృతఘ్నత్వము పోఁగొట్టుకొనుటకే నాయీసంకల్పము" అని కోటిసారు లుటంకించినారు. కావున వా రిపుడు వెనుకటివలె కృతఘ్నులు కారనుటకు వీ లు లేకపోయినది. ముమ్మాటికిని కృతఘ్నులని కృపణులని, అసూయాగ్రహావిష్టులని యనక తప్పినదికాదు. దానికి వారి వ్రాతలు వారిచేతలే సాక్షు లగుచున్నవి. "మీశృంఖలము చూచిన హించినాను. మీశృంఖలములోని వ్రాతలు దారుణాతి దారుణములు" అని వేయిసారులు వారు వ్రాసినారు ఆశృంఖలములో వారుచేసినకృతఘ్నత్వమునకు తగినమాటలు ప్రయోగింపలేక పోయితినని యిప్పుడు విచారించు చున్నాను.

వారి ప్రతాపము.

వీరు వ్యాకరణము తల్లక్రిందులు చేసినామని చెప్పుచు నన్నుదిరస్కరించిరే కాని శృంఖలములో వీరియభిప్రాయములోని వ్రాతలు చూచినవారికి వీరికి వ్యాకరణ మేమాత్రమును తెలియదని స్ఫురింపక మానదు. శృంఖలము ప్రకటించినప్పుడు నాయీమాట సత్యమని లోకమునకుఁ దెలియకపోదు. భావిపరిణామము నూహింపక శృంఖలము నేను వ్రాసితిననియు నిపుడుపసంహరించి ప్రకటింపక నిలుపుచేసితిననుటయు సాధారణముగా సామాన్యు లనవలసినమాట గాని విజ్ఞు లనవలసిన మాటగాదు. దీనింగూర్చి యిటీవలిచర్యలో ఆటావలిగిర్యలో తొంబదితొమ్మిది! వ్రాసికొనిండు. తత్ప్రతిక్రియకు నాప్రయత్నము నుండకపోదు. నా పెండేరమునకు భంగమని శృంఖలము ప్రకటింపకుంటినని వారిచర్యలో వ్రాసిరి. పెండెరమునకును శృంఖలమునకు సంబంధమేమియో? ఈయన యడ్డువచ్చి కార్యభంగము చేయుననియా? ఈభయము. నా కాలి చిటికెనవ్రేలిగోటి కొనకైన నుండదని, యుండబోదని ముమ్మాటికిం జెప్పుచున్నాడను. నాజీవితకాలములో నట్టిపద్యములతో నుండిన చర్య నాకులభ్యమైన యెడల దానిసంగతియాలోచించి తీరెదనని శపథము చేయుచున్నాను.

నావిషయములో యథార్థమైనది వ్రాసినను పాపము వచ్చునని వా రనుకొనుచున్నప్పుడు అయథార్థమైనది వ్రాసినప్పుడు వచ్చెడుపాపము వారె నెట్టుచేయవలయునో యట్టుచేయక మానరని నా నమ్మకము. ధనముకొరకు ప్రయత్నింపవచ్చును గాని ప్రతిష్ఠకొఱకు ప్రయత్నింప రాదట! ప్రయత్నించిన పనిచేయదట! రసాభాస మగునట! ఈమాటలు గమనింపవలెనట! ఇవి బాలసరస్వతిగారి ముద్దుమాటలు. చిత్తగించితిరా యీముద్దుమాటలు? ఎట్లు లోకధర్మమును దలక్రిందులు చేయుచున్నవో చూడుడు. "యశసిచాభిరుచిః" అనుటం బట్టి ప్రతిష్ఠకొఱకు ప్రయత్నింపవలయును. ధనముకొఱకు ప్రయత్నింప రాదు. అని యెంచుకొనియే కదా మనపూర్వులు చెఱువులు, నూతులు త్రవ్వించియు, అన్నసత్రములు పెట్టించియు, కృతులందియు, యుద్ధములుచేసియు, మరియెన్నో కార్యములు చేసియు, కీర్తిప్రతిష్ఠలకొఱకే ప్రయత్నించినట్లు వినుదుముగాని దొంగతనముచేసియో, జూదమాడియో, పూటకూళ్ళు పెట్టియో. పగటివేషములు వేసియో. కన్యావిక్రయ మొనర్చియో' అమ్మరానివస్తువుల నమ్మియో, కుశీదవృత్తికిం బాల్పడియో, మరేమేమియో చేసినవారై ధనముకొరకు ప్రయత్నించి నానాదుష్కార్యములుచేసి చేయుచున్నట్లు వినియుండలేదు మనకవిగారి యాచారకాండములో నిట్లున్నదేమో. పోనిండు. దానికేమి? నేనుప్రతిష్ఠకొరకు ప్రయత్నించిన , పనిచేయదు. రసాభాసమగును. అనికదా వీరిమాట నాకార్యము రసాభాసమైన తనకేమి నొప్పియో? నొప్పియునులేదు గిప్పియునులేదు. చెప్పిచెప్పి చేయింపకుంటయే తముగొప్పతనమునకు నొప్పిన కార్యము.

### కృతుల చేయించుకొనుట.

విశ్వకర్మశిష్యులచేత నాహరికథను నేనే వ్రాయించుకొంటినట! ఆహరికథలో నేను వ్యాకరణము చదివినట్లు వ్రాయబడి యున్నదట!

ఉండిన నుండుగాక! వీనిదేమి మునిగిపోయినదో? వీనికింత కడుపుడుగ్ధ యేమిటికో? అందలి వ్రాతలవలన వచ్చునింద నాదిగాని తమదికాదే కాని యప్పుడింత కొట్టుకొనుట యెందులకో? ఇది యోర్వలేమి యని యు, సహింపలేకపోవుట యనియు తెలియవచ్చుటలేదా? తాను కవి యు, శాస్త్రియు, అవధానియు,లోనగుపేళ్ళు పెట్టుకొనియున్నవారు గా వున మరియెవ్వరు కవియని, శాస్త్రియని, యవధానియని పిలిపించుకొన గూడదని వీరియభిప్రాయము కావచ్చును. నాచరిత్ర హరికథగాకూడ వ్రాయబడినదని తెలియవచ్చినంతనే మచ్చరము పెచ్చుపెరిగి, శిష్యుని చే నేనేవ్రాయించుకొంటినని నా కప్రతిష్ఠ గలిగించుతలంపుతో నిట్లు వ్రాసెనను స్పష్టము ఈనడుమ యీయనశిష్యులు పింగళి లక్ష్మీకాం తముగారు, కాటూరివేకంటేశ్వరరావుగారును కలసి "సౌందరనంద" అను నొకగ్రంథమురచించి వీరికి షష్టిపూర్తి సందర్భమున కృతియిచ్చి నారు. శిష్యులను ప్రార్థించి గ్రంథము చేయించి తా మీకృతి పొంది నారని మనమూహించి వేంకటశాస్త్రిగారివలె తొందరపడి వ్రాయసా హసింతుమా? మరియు, నిపుడు అడవి శంకరరావుగారు వీరి జీవితచరి త్రమును వ్రాయుచున్నారుగదా! అదివీరేవారికి సర్వమును చెప్పి వ్రా యించుకొనుచున్నారని చెప్పుటయును తప్పే. ఇత్యాదులెన్నియో కలవు. వాని నే నిట చేర్కొనుటయు నుచితముకాదని విరమించు చున్నాను.

పాణినీయ పఠనము.

"నేను పాణినీయము చదివితినో లేదో తన కేమిటికి? తానుచదివెనో లేదో నాకేమిటికి నేనెక్కడ గాని పాణినీయము పాడికట్లు తనుకు తెలి య ద ట! తా నె వ రు ? త న కు తె లి యవలసిన య వ స ర మే మి? ఈయనసనాకు దొరయా? దాతయా? నేను చదువని పాణినీయము చదివితినని వ్రాయించుకొనుట లోకవ ను

కారణమట! నాకువచ్చు లోకువకు తాను కయ్యిపెట్టనేల? నేనెవరియొద్ద పాణినీయము పాడితినో వారిని తాము అడుగుదుమని వ్రాసినారు. వారికి వ్యాకరణమురాదని సూచించినారు. అట్లనుచో వీరిగురువు బ్రహ్మయ్యశాస్త్రిగారి కేమియు, రాదనియు వీరికి సంస్కృతాంధ్ర జ్ఞానమే లేదనియు, నే ననుటకు సాహసింతునా? నేను రాజమహేంద్రవరమునకు వచ్చినపిదప తాము ధవళేశ్వరములోచదువుకొనుచుండ నాకు పాణినీయము చెప్పుచుని నేనువారిని కోరినట్లు వ్రాసినారు. ఈవ్రాయుట తమ గురుత్వప్రతి బోధనార్థమే. నాకందువలనవచ్చు ప్రతిబంధక మేమియును లేదు. తనకురానిది. శిష్యునకు వచ్చినది యయిన విద్య గురువు కోరవచ్చును. చెప్పుకోవచ్చును. "అథవావిద్యయావిద్యా" అని యున్నదికదా ఇందు తప్పున్నదని నేనుతలంపను. కాని కోరినారని చెప్పుటకన్న నాయొద్ద పాణినీయము చెప్పుకొనెననియు, నేనే గురువుననియు వ్రాసినను నాకు సమ్మతమే. అప్పుడు తామేన మూలలోనున్నారు. వారా నాకుజెప్పువారు? నేను మాగురువులవారియొద్దనే కౌముది కొంత కొంత తరువాయిగా చదివితిని. ఆచదువునప్పుడు "శ్లో॥ ప్రపరాప సమన్వవనిర్నిర్ దుస్దుర్... ఏతే ప్రాదయ ఉపసర్గసంజ్ఞాస్స్యుః" ఇట్లు శ్లోకరూపముగా కౌముదిలోని పెక్కువిషయములు రచించుకొని పఠించితిని. కానిందు వారు చెప్పినట్లు నేను రాజమహేంద్రవరము వచ్చునప్పటికి నాకు వ్యాకరణము రాదనియే నిశ్చయించుకొందము. ఆనాడు మొదలుకొని తాము అ. ఇ. ఉ ణ్. ఌ. మొదలుపెట్టి భాష్యమువఱకును పాడగలిగినప్పుడు 40 ఏండ్లలో మూలమైన నేను చదువలేక పోవునంతటి బుద్ధిమంతుఁడనా? కాటవరములో నాగలింగశాస్త్రి గారియొద్ద ప్రారంభించి, కొంతచదివి, రాజమహేంద్రవరమునకు వచ్చిన పిదప కొన్నినాళ్ళకప్పుడప్పుడు కల్లూరి వేంకటరామశాస్త్రి గారియొద్దకుంబోయి ఇంచుమించు కౌముది యంతయుం జదివి వీరికన్న మిన్న

గానే శబ్దస్వరూప మెఱింగిన వాడనై తినని సగర్వముగా చెప్పు చున్నాడను.

## కవిత్వము—అవధానము.

నాకవిత్వము తమ కవిత్వముకన్న నధమమనియు నాకవధానశక్తి లేదనియు, బాలసరస్వతిగారు సెలవుదయచేయించినారుకదా ఏతద్విషయమై నాసంగతి లోకమెఱింగియున్నదైన నిప్పట్లు మఱియు కొంచె మెఱింగింప వలసినయవసరము గలిగించుకొనుచున్నాను. ఇటనేను యథార్థకథనమే చేసినను లోకుల కాత్మస్తుతిగా తోచునేమోయని సందేహమునన్ను బాధించుచున్నది. అయినను సమయము వచ్చినప్పుడు నివేదించుకొనుట తప్పుకాదని నిశ్చయించుకొని యిట్లు సాహసించుచున్నాను. ప్రాజ్ఞులునన్ను క్షమింతురుగాక. 55 సం॥ వత్సరములనుండి నేను కవిత్వకృషిచేయుచున్నాను. నాటక ప్రబంధాదులు 120 గ్రంథములు రచించితిని. మూలానుసారముగ శ్రీమహాభారతము 60 వేల గ్రంథముగ తెనిగించితిని. చతుర్విధకవిత్వమందు నేనుమిక్కిలి పరిశ్రమ చేసితిని. బంధ, గర్భ, చిత్ర పద్యములు పెక్కులుచేసితిని. ఇప్పటికి 70 యేండ్ల వృద్ధుడనైనను ఆశుకవిత్వములో పేరుపొందినవారికన్న కొన్నిరెట్లుమిన్నగా ఆశుకవిత్వము చెప్పగలనని గర్వపడుచున్నాను. అనేకదేశములందుఅవధానములు నుచేసియున్నాను. నాయవధానములలో వ్యస్తాక్షరి, న్యస్తాక్షరి, లిఖితాక్షరి, నిషేధాక్షరి, దత్తాక్షరి, అనునవి కలవు. అందు ప్రత్యక్షర పంచాక్షర నిషేధాక్షరియు, సహపఠనమును ముఖ్యములు. ఇప్పటికి నే నెవరేభాషచదివినను వేదాదులైనను, వారితో వచ్చినవారు, చదివినట్లు చదువుదును. ఇట్టిస్థితిలో మాబాలసరస్వతిగారు నాకవధానశక్తి అప్పటికిని ఇప్పటికిని సందేహమేయని చెప్పుట పొరపాటనక తప్పదు.

14—3—36 తేదీ కృష్ణాపత్రికలో చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు నాకు సూక్ష్మోపాయ మొక్కమాటలో చూపినారు. బుద్ధిహీనుడనగు నాకడనింక కోటిమాటలు చెప్పినను ప్రయోజనముండదు. అసత్యవాదినని నన్నెప్రబుద్ధుఁడెట్లు వ్రాసినను వ్రాయుగాక. దానిని నిశ్చయించువాఁడు దేవుఁడే కలడు.

రాజమండ్రికోర్టులో పండితాభియోగమందు 'ప్లీడరు' క్రాసు చేసినప్పుడు "చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి నాశిష్యుఁడు" అని కాని మరియొక విధముగాగాని చెప్పియుంటినేమో? అది నిర్బంధవిషయము. ఇదిగాక యితరులు తగినవారడిగినప్పుడు నట్టిదియేయగు. భార్యానామగ్రహణ మొకప్పుడు చేయవలసివచ్చును. అదియును నిర్బంధమే. అయినను శాస్త్రిగారేదో పత్రికంజూచి వ్రాసినారు. ఆవ్రాసినవారు సరిగా వ్రాసిరో లేదో? రికార్డుచూచినప్పుడుగాని నిశ్చయించుటకు వీలుండదు. "వారినిగూర్చి నేవ్రాసినవ్రాతలు వారే కాదనగలిగినచో" అనుపదదీనికి సమన్వయింపబడదు. మఱియు ననేకవిషయములు నావ్యాసములో నుదాహరించియే యున్నాను. వానినిమరల నిటవ్రాయనవసరము లేదు. అయినను రెండు మూడుమాత్రము సూచించుచున్నాను.

(1) "శ్రీపాద గురువులకడ నాశుశ్రూష" "నాముక్త్యాల ప్రయాణము" అని యకారణముగా పెద్దపెద్ద వ్యాసములువ్రాసినారు. (2) మనః కలహములు పెంచుకొనుట వ్యాసములువ్రాయుట తగదని 28—12—35 వ తేదీని శాంతివ్యాసమును నేనువ్రాసితిని (3) దానిపై శాంతింపక "చంకదుడ్డుశరణార్థి" వ్యాసమును వ్రాసిరి. (4) కానీనశబ్దవిచారములో గానాల రామమూర్తిగారు తమపై వ్యాసమును వ్రాయగా దానిపై రెండు వ్యాసములువ్రాసి నన్నుదూషించినారు. (5) నేనుహరినాగభూషణముగారికి బహిరంగలేఖ వ్రాయఁగా దానిము నడుమువచ్చి నేనుక్రోధిననియు భూషణముగారిని దూషించితిననియు

శాంతియను పేరితో అశాంతివ్యాసము వ్రాసిరి. (6) వారును కొప్ప రపువారును రామకృష్ణకవులును గలహించినప్పుడెప్పుడును నే నెట్టి వ్రాతయును వ్రాయలేదు. (7) నా శత్రుపక్ష మవలంబించి బందరు వారి వ్రాతలు సమర్థించినారు. (8) ముక్త్యాల రాజావారితో కృష్ణ మూర్తిశాస్త్రిగారి నొప్పించి నేను తీసికొనివత్తునని చెప్పి తుదకావని చేయలేదు. నే నెన్నిసారులు వెళ్లి ముక్త్యాలకు రమ్మన్నను సాకులు చెప్పెనుగాని రాలేదు. (9) పాలకొల్లువారి యగ్రిమెంటు మును ముస్సు రద్దుచేసికోవలెను. దానివిషయమై నేనుకూడ పాలకొల్లుకు వత్తునని నన్ను ప్రోత్సహించినారు. (10) మీరు రచించిన భారతము పైభాగము రాజాగారు నన్ను రచింపుమని కోరినారని నాతో చెప్పి నారు. (11) నారాయణరావుగారిని పిలిపించి వారిచే వ్యవహారము పరిష్కరింపింతునని చెప్పినారు. (12) పాలకొల్లు కృతిసందర్భమున కృతిపతులంగూర్చి చక్కగా మాటలాడుమని నేను కోరినం గోరినట్లు చేయక నానారాజ సందర్శనము చెప్పినారు. (13) పాలకొల్లులో మఱియొక సభలో మొల్ల మొదలగువారి కవిత్వమెంచుచు స్త్రీలు కవిత్వము చెప్పిరన్న గ్రంథములు చేసిరన్న నే నంగీకరింపను. తం డ్రులో అన్నలో గ్రంథములువ్రాసి వారిపేర్లు పెట్టియుందురని యింత లో నటనున్న నన్ను చూపి మాగురువుగారి కొమార్తెకూడ కవి త్వము చెప్పును. కొన్నిగ్రంథములు వ్రాసినది. యని చెప్పెను. (14) వనంవారిని భూషించుచు నన్ను గర్హించి తప్పుగా నభిప్రాయ మిచ్చినారు. (15) మఱియు నెన్నోకలవు. కొన్ని వారు కోరుటం చేసి మున్ను చెప్పినవియే యైనను మరలఁ జెప్పితిని.

పాపమునకొడిగట్టి శాస్త్రిగారు వాని నెగిరిపోవునట్లు చేసినప్పు డు చూచెదనుగాక! "మాఘమువఱకు" అనునదియు "శృంఖలము" ను వివాదకారణములేమైనను అవి 3, 4, సం॥ రముల నాటివి, ఈలో

మేము సామరస్యముతోనే యుంటిమి. జోడు సాలువలిచ్చి లేనిపోని మాటలుచెప్పి యెవ్వరోచేసిన ప్రోత్సాహమే యిట్టి "అస్తావ్యస్తపు" వ్రాతలువ్రాయించి కలహము పెంచుటకు కారణమైనదని నేవ్రాయుట పిచ్చివ్రాత కానేరదు. "కాసుకుగడ్డితినేవాఁడు" అనునది వారువ్రాసుకొనినదియే. ఆయనకు పట్టపగ్గాలుండవట! ఏమియతిశయమో! పగ్గాలుండవన్న పగ్గెలెట్లు పరిణమించునో చూచెదంగాక.

"ఇంతతోనైనా నా గురువుగారు విరమించి సాచీమార్గానికివస్తే నంతోషించి మిన్నకుందును" అనివ్రాసినారు. నాదెప్పుడును సాచీమార్గమే. పేచీమార్గ మెన్నటికిని లేదు. కావుననే యకారణముగ నన్ను గర్హించుచు 7, 8 వ్యాసములు వ్రాసినను సైచి "చావదీరిన మనకీ వివాదముతగదు. విరమింపుము" అని నేనువ్రాసినను మానక చెలరేగి నామాన ప్రాణధనములెల్ల కొల్లఁగొట్టినట్లు వ్రాతలో నిక తరువాయి లేనియట్లు వ్యాసములువ్రాసి, నాభారతమును నిరసించి, నాచదువు చట్టుమండలముచేసి, నాగౌరవమునకు భంగపాటు వాటిల్లఁజేసి లోకము నన్నధమాధమునిగఁ బరిగణించునట్లొనర్పఁబూనినప్పుడుదు నేను నా యావిషయములలో సమాధానము చెప్పకుందుటయు, చెప్పకూరుకుండుమనుటయు, నెట్టిదో తెలియదు. నేచేయునది "డిఫెన్సు" గాని. "యఫెన్సు" గాదు. వారుసూచింపని యేయింత విషయమును నేను స్పృశింపలేదు. ఇట్టిచో నన్నువిరమింపుమనుటయు, నేనువిరమింతుననుటయు, తటస్థించునవికావు. వారినిమిన్నకుండుమని నేనిదివఱలోనన్నను ఇప్పు డనను. వారు నన్నుగర్హింపవలసిన విషయములలో మిగిలినవి లేవనిచెప్పితిని. ఉన్నయెడల మిన్నకుండక స్వేచ్ఛావిహారము కావింపవచ్చును. పట్టపగ్గాలులేకుండఁ బ్రవర్తింప వచ్చును.

ఉభయపక్షములఁ గణార్జునులవంటి వారింబెట్టి వాదింపఁజేయునట్లొనర్పఁబూనించినాడు.ఆమర్యాదయుందీరినది,అట్లునన్నుగర్హించుచు

నా పైవ్యాసముల వ్రాసినప్పుడ కూడ నేను వ్యగ్రితం బోరయక
అడవి శంకరరావుగారు, బెజవాడ వేంకటస్వామినాయుడుగారు నా
యొద్దకు వచ్చి ప్రసంగించినప్పుడు "అయ్యా! వారివ్రాతలకు బదులు
నే నేమియు వ్రాయను. కాని మీరు మీయిష్టమువచ్చినవారిని
5 గురు మధ్యవర్తుల నేర్పాటు చేయించి మీరు మాయిరువురవాదోప
వాదములు విని మీకు తోచినట్లు శాసింపుఁడు. దానికి నేనంగీకరిం
తును. వారిచేకూడ నంగీకరింపఁజేసి దానికై ప్రయత్నింపుఁడనిచెప్పి
తిని. వారు "సరే" యనిరి కాని శాస్త్రిగారి యంగీకారములేమిం
జేసి కాఁబోలు తత్ప్రయత్నము చేయక విరమించినారు. ఇప్పుడు
పాకము ముదిరినది. కర్ణాజునులు నక్కఱలేదు. గిర్ణాజునులు
నక్కఱలేదు. నాకు సులువైనమార్గ మక్కఱలేదు. నాకిక బలువైన
మార్గమక్కఱలేదు. "యశోవా మృత్యుర్వా" అనునదియేగతి.

శాస్త్రిగారు నే నెవరిగ్రంథము నో సంస్కారమొనరించుకొనుఁ
డనియు, దానభూతి గలుగుననియు వ్రాసినదానిం బట్టుకొని "వారిని
దిట్టినారు అదిఘోరము. అందుకు నేను సహింపలేకపోయితిని". అని
లోనగుమాటలు పెక్కుసారులు వ్రాసిరి. శాస్త్రిగారు తమగీరతము
107 వ పుటలో— —: శాస్త్రిగారి మృదువాక్యములు :—

" ఉ. పాశుపతాగ్నిహోత్రమున భగ్గునమండి వెలింగి బూదియై
రాశికిరాక దూళియుఁ బరస్పరమేళనలేమి బ్రిఁగఁగా
నాశనమయ్యె దానికి వినాశనకాలము మూడి మున్నె మీ
యాశలతో శతఘ్ని;యిఁకనైనను మేల్కొని మేల్కొనం దగుఁ.

అని యొకరినిగూర్చి వ్రాసినారు. ఈపద్యములోనివి తిట్లు
కావు దీవనలే. మఱియు ననేకపద్యములిట్టివి పరులను గూర్చి శాస్త్రిగా
దులు పెట్టినవి పెక్కులున్నవి. ఈగ్రంథమందు అనగా వారునన్నుఁ.
గూర్చివ్రాసినవ్యాసములో "ఆసీమాంతము చేసికాని విడువను" అని
వ్రాసిరి. "ఆసీమాంతమనువ్రజే" అని శాస్త్రిద్ధాంతమందుఁ బితరులను
సాగనంపుచుఁ జెప్పుదురు. అట్టిపని నానుఁజేయుదునని నీరిసంకల్పము

కాదా? దీనిని లోకమేమందురో? ఇత్యాదులు వేసవేలు. అవసరమైనచో నుదాహరింతును.

ఇదిగాక వీరుగీరతములో గురుభక్తినిగూర్చి కొన్నివందలపద్యములు సోదాహరణములుగా వ్రాసినారు. అవియన్నియు, రామకృష్ణకవులపై వీరు వ్రాసినవ్రాతలన్నియు నిప్పుడు వీరివ్యాసములవలనఁ జెడిపోయినవనియు, రామకృష్ణకవులు విజయము నొందినవారయిరనియు లోక మూహించుటకు వీలుగలిగినది. "శ్లో. ఏకాక్షరప్రదాతారం యోగురుం నైవమన్యతే। శ్వానయోనిశతంగత్వాచండాలేష్వభిజాయతే" అని ధర్మశాస్త్రమునుండి తమగీరతములో నుదాహరించియున్నారు దీనింబట్టి వీరికెట్టిగతిపట్టవలయునో దైవమే నిర్ణయించునుగాక.

—• శ్రీరంగనీతులు •—

ఈనడుమఁ గొన్నినాళ్ళనుండి వెంకటశాస్త్రిగారు శ్రీరంగనీతులు వ్రాయుచున్నారు. లోకము వన్నుగహింౘుచునట్లు చేయుచున్నారు. ఈలో వారి సహధర్మచారిణి దివంగతురాలయ్యెనని విని మిక్కిలి విచారించి లోకధర్మంబుం బురస్కరించుకొని నేను వారిని జూచుటకు కొందఱుపెద్దమనుష్యులతోఁ గలసి వెళ్ళినపుడు, నేను గోపముతో బెద్దకేకలువేసితినని వారు వ్రాసినారు. అది సత్యముకాదు. అప్పుడు సమయముగాకున్నను మాయిద్దఱకుఁ బెరుగుచున్న వివాదప్రసంగముఁ దెచ్చినారు. 'ఇది సమయముకాదు వల' దని నే నెంతశాంతముగఁ జెప్పినను వినక "నేనరవకొయ్యను నేనింక తెగించెదను ఎట్లుచేయవలయునో యట్లు చేయకమానను" ఇత్యాదులెన్నో పలికి[illegible]ముల్లుకఱ్ఱతో పొడిచినట్లు పొడిచినారు. దానిపై నేను వడిగా మాటలాడినాను. హృద్రోగము కలిగినది. ఇందు నాతప్పున్నదేమో అప్పుడచటనున్నపెద్దలే చెప్పఁగలరు.

నావ్రాతలలో సారము లేదని వారు వ్రాసిన వ్రాయుదురుగాక. నావ్రాతలలో నొక్కముక్కయైన బీఱువోవునదియు, నసత్యమైనదియు, వృథాకాలములు నింౘించునదియు, నున్నదని యెవ్వరైనఁ జెప్పఁగలిగినచో సమాధానము చెప్పి వారి నొప్పింపఁగలను.

"ఏదోవ్రాసి వృథాగాఁ బనికల్పించి బాధిస్తూవుంటే తట్టసం

గా వుండడం మీకు ధర్మమేనా?" అని మార్చి 17 వ తేదీ కృష్ణలో వ్రాసినారు. ఇది సరియైనవ్రాతయా? శాంతముగా నున్న కాలములోఁ బెద్దచేట భారతము వ్రాసినప్పుడు నేను బదులు వ్రాయవలయునా? లేదా? నేనిప్పుడు చేయుచున్నదట్టిదియే కాని, వేరుకాదు. వారిని నేను బాధించుట యెట్టిదో లోకమే నిశ్చయించును. "నేను నాయిష్టమువచ్చినట్లు బూతులో నీతులో వ్రాసినాను నోరు మూసికొని పడియుండక సమాధానము వ్రాయుట తగ"దని చెప్పుదురా? నన్ను వారు బైట కీడ్చి బాధపెట్టినారో? వారిని నేనుబాధపెట్టుచున్నానో? లోకమునకు తెలియదా? „జరిగినదేమో జరిగినది. ఇఁక దీనినుండి విరమించి లోకానికి సంతుష్టి కలిగించుదాము" అని వ్రాసిరి. నేను బదులు వ్రాయనప్పుడు లోకానికి సంతుష్టి యెట్లు కలుగును? ప్రపంచమంతయు వారిమాటలే వేదములని విశ్వసించి యుండవలసినదని వారి యభిప్రాయము కాఁబోలు!

—♦ అధికప్రసంగము ♦—

తమ చరిత్రకు "మాఘమువలకు" అని నేను వ్రాసినది భంగము కలుగునను భయముచే నిట్లు వ్రాయవలసివచ్చినదందురా? అదియే నిజమైనయెడల దానివిషయమైన వ్రాతలే వ్రాసిన నేనుసమాధానము చెప్పియుందునుగదా! అట్లుగాక, నాగండపెండేరముఁగూర్చియు, నా బిరుదములంగూర్చియు, మఱియు నదియు నిది యననేల నాసర్వవిషయములంగూర్చియు, పరిహసించుచు వ్యాసము వ్రాయవలసిన యవసరముండునా? „మగనిగొట్టి మోసమని మొత్తుపెట్టినట్లు" పైగా నేను వారిని స్థిమితముగా నుండనీయక జవాబు చెప్పుచున్నానని నిందనాపై వేయుట సంప్రదాయమా? తమదోషము కప్పిపుచ్చుకొనుటకు శాస్త్రిగా రెన్నియోపోకల్లు పోవుచున్నారు. నేనుశాంతముగాఁ గాలక్షేపము చేయుచున్నకాలములో నన్ను రేపి నాకు మనస్తాపము గలిగించి నానా దుష్టవాక్యములు వ్రాసి యిప్పుడు నన్ను విరమించుమని యెన్నివ్రాసినను నేను వ్రాయవలసినదెంతో యంతయు వ్రాయక విరమించువాఁడను గానని మనవిచేయుచున్నాను. తానరవమేకై నన్నేమిచేయునో చూతముగాక! ఇంతటినుండి యిట్టి తెలివితక్కువవ్రాతలు వ్రాయవల

పనియు తాటియాకులచప్పుళ్ళకు కుందేళ్లు బెదరవనియు తెలియఁ జెప్పుచున్నాను.

## —♦ కాకరపర్తిసభ ♦—

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు చంకదుడ్డుశరణార్థివ్యాసములో “శంకరుఁడు పాశుపతాస్త్రం బిచ్చినట్లు ఆ మహాత్ముఁడు (బ్రహ్మయ్యశాస్త్రిగారు) నాకు వ్యాకరణశాస్త్రాన్ని దయచేశారు. దానిచేతనే ప్రతిసభలోను నేనాడింది ఆటగా పాడింది పాటగా సాగింది” అని వ్రాసినారుగదా! ఏసభలో నట్లుజరిగినదో తెలియదుగాని ఈక్రిందిసంగతుల వలన వీరికి వ్యాకరణజ్ఞానముగాని భాషాజ్ఞానముగాని లేదనియు, ఇది యంతయు మేకపోతు గాంభీర్యమనియుఁ దెలియవచ్చుచున్నది. చిత్తగింపుఁడు. వీరు గీరతమను నొకగ్రంథము వ్రాసి యందు “కాకరపర్తిపర్వము” అని యొకభాగమునకుఁ బేరుపెట్టినారు. ఆకాలమున విరోధికృత్సంవత్సర వైశాఖ శు ౧౩ నాఁడు కాకరపర్తికింజని మన వేంకటశాస్త్రి గారొకసంపన్నుని గృహమున నివసించి తాము వ్రాసిన గీరతమును వినిపించువారై పండితుల నాహ్వానముచేసి సభలో “వారి కేమి తెలియును వీరికేమి తెలియును! నే నింతవాఁడ నంతవాఁడ” అని ప్రగల్భము లాడగా కర్ణకఠోరములైన వారిమాటలు విని సభ్యులు సహింపలేకపోయిరి. ఆసభలో వేమల నారాయణశాస్త్రిప్రభృతులు గలరు. వారు “నీకు వచ్చినవ్యాకరణమేమో రమ్ము ప్రసంగింపుము వాక్యార్థము చేయఁగలవేని నోరెత్తుము” అని పలుకగా మన వైయాకరణకంఠీరవుఁడుగారు మాటలాడనేరక “తె- తె- తె- వె- వె- వే” అని వాక్యార్థము చేయుటకుఁగాక కౌముది చేతికిచ్చి “ఈ సూత్రమున కర్థమేమి చెప్పు” మన్నను చెప్పలేక “నేనిది మఱచిపోయితిని చెప్పలేను” అని సిగ్గువిడిచి పలికినారు. అపుడు రామశాస్త్రిగారను నొకపండితుఁడు ఆయనచెంతకువచ్చి నీకు సాహిత్యజ్ఞాన మెంతగానున్నదో ఇదిగో ప్రతాపరుద్రీయము తెచ్చినాను. ఇందు నాలుగుపంక్తులు చదివి యన్వయింపుము. చూతము” అని పుస్తకము చేతికీయగా మన శాస్త్రిగారు “ఇది నేను చదువలేదు మాతిరుపతిశాస్త్రి చదివెను. నేను చెప్పలేను తిరుపతిశాస్త్రియు నేనును శ్రావణమాసములో వచ్చి

చెప్పెదము" అని చెప్పి పరాజితులై పిక్కబలము చూపినారు. ఇది జరిగినసంగతి. ఇట్లు శృంగభంగమును గ్రంథములో పద్యరూపముగా ప్రకటింపఁబడియున్నది. ఈవిషయమై వీరిగీరతమునందును సూచింపఁబడియున్నది. దీనింబట్టి విచారింపఁగా వీరికి శాస్త్రజ్ఞానమేకాక సాహిత్యజ్ఞానమును బూర్ణానుస్వారమే యని తెలియుచున్నది. వీరి కవిత్వము గ్రామ్యభూయిష్ఠమని వెనుకనే చెప్పియున్నాఁడనుగదా! అట్టి వీరు "బ్రహ్మయ్యశాస్త్రిగారి శుశ్రూషకు నేను వెళ్ళకపోయేయెడల నేను న్నూతనవంటికవినే యగుదును" అని చంకదుడ్డు శరణార్థివ్యాసములో వ్రాసియున్నారు. తమవంటి కవినే యగుదునని యహంభావముతోఁ బలుకగలిగిన వీరికవిత్వతత్త్వమంతయు లోకమునకుఁ దెలియఁజేయఁవలసిన యవసరము నాకుఁ గలిగినది. ఆకార్యము సంపూర్ణముగా చెరలాటము ద్వితీయభాగమునఁ జేయనెంచియు స్థాలీపులాకన్యాయముగా వీరిగ్రంథములనుండి కొన్నివిషయములు సంక్షేపముగా మచ్చునకుం జూపుచున్నాను. ఇపుడు నేసూచించునవి జాతకచర్య, బొబ్బిలిపట్టాభిషేకములలోని కొన్నిపదప్రయోగములు మాత్రమే. నడిపించు ఇట్లు ప్రేరణమున నుండదు. నడపు, నడుపు అనియుండును. ఇట్టివి పెక్కులు; అందచందములు—ఇది తప్పు. స్త్రీసమములక్ష్యద్వంద్వమగు. కూరగాయలు, తాతలప్పటివి, కలిసి ఇత్యాదులు శబ్దదోషములు; రాజితప్రేమ, ప్రతిప్రభవాబ్దము, కవిప్రశంస ఇత్యాదులెన్నో సంయుక్తపూర్వము గురువుకాకుండ తేల్చివేసితప్పులు తప్పులు; క్షమియింపుటల్=ఇట్టివి పెక్కులు, చూపులు=బహువచనము పై బహువచనప్రత్యయములు ఇట్టివి పెక్కుస్థలములఁగలవు; చెవులూరుచు—ఇది నోరూరువంటిదికాదు. క్రముగారునప్పుడిట్లు తగును. చంద్రిద్యుతుల్ యామినుల్—వసంతరాత్రుల నిట్లువర్ణింపరు; ఈరాత్రులు శారదరాత్రులుకావు; బృందారణ్యము...తీర్థము. ఇది తీర్థముకాదు క్షేత్రము; చూచుక, పట్టుక, కొట్టుక; ఆత్మార్థమందు కొనికి బదులు 'క' ప్రయోగముసరికాదు. ఇట్టివి శతములు సహస్రములు; పంచభూతత్వములు=పంచపల్లవములకిట్లు తగదు. త్వచము పల్లవముకాదు.

అఖీష్టకకాలమునందుఁ బల్లవములే కాని త్వచములుకావు; కోర్కులు=ఇట్టివి యతిప్రాసములలో పడియున్నవి. కోర్కె, కోర్కులు అని సవరించిన యతిచెడును. పురమేగి, గ్రామమరిగి=ఇవి కారకదోషములు వేనవేలు; అందున, ఇందున=సప్తమీప్రత్యయమగు నందుపై నకారము తప్పుకాకపోదు; అందుకు, ఇందుకు=ఇవి శబ్దదోషములు; జటప్రోలిందిర=ఈసమాసము తప్పు; "తేలప్రోల్విభుడు సింహాద్రిరాట్పుత్రిక" తేలప్రోల్విభుఁడు సింహాద్రిరాజు, ఇట తేలప్రోల్విభుఁడు పుత్రికకన్వయించును. ఇది యేకదేశాన్వయదోషము, కొమిరెలు=కూఁతులకర్థమములేదు. ఇటఁ గూఁతులే చెప్పవలయును; కొమిరె=యౌవనము గలస్త్రీ; ఇట సరిపడదు ఇట్లు బహుస్థలములఁ బడియున్నది; "అలఘునియాజ్ఞగైకొని మృతాయితుఁడౌ సుతుతోడ" ఇత్యాదులందు హల్లుతోడనే యతిచేయనలెనుగాని యచ్చుతోడం గూడదు. ఇట నచ్చుతో యతితప్పు. మధ్యమధ్య=పోవుచు మధ్యర్ణము వర్ణము లేక ప్రయోగములు మృగ్యములు; తెల్వి=తెలివియగుఁగాని సంయుక్తము తగదు; గ్రంథార్జనచేసి=ఆర్జనముచేసి యనవొప్పు. పర్యాగకేగి=ప్రయాగమునకేగి యనఁదగు; "క. విని సైపక యిది యింతేనిని గ్లిష్టము" ఇందు నిని తప్పు. "కింకవిగజసింహాబిరుదు" సింహశబ్దము సంస్కృతము, బిరుదు తెలుఁగు సమసింపదు; సింహబిరుద మనఁదగు. అవిన పద్యము చెడును. చేతురు, కోతురు ఇట్టివి వేనవేలు; కొన్ని పుటలు చూచినంతనే యిట్టిపదస్థాపనము వారికవిత్వమునం బొడకట్టుచున్నప్పుడు నాకవిత్వముకంటెఁ దమకవిత్వ మధికమని యేలవారు వ్రాసికొనఁగూడదు? వ్రాసికొనవచ్చునని యే చెప్పుచున్నాను.

శతఘ్నిలో మనతిరుపతివెంకటేశ్వరుల గ్రంథములనుండి వేనవేలు తప్పులుదాహరించి యున్నారు. అందు కొన్నిమాత్రము వ్రాయుచున్నాను. జరిగినపట్టు వినిపింపవచ్చితిని—ఇది యపరూపము. జరిగినంతవట్టు చంపీచంపనిరీతి—నింద్యగ్రామ్యము; నిగుడ్చి—తప్పు నిగిడ్చి; బాలవ్యాకరణమురామి నిట్టితప్పులు కలుగకమానవు. అశ్వత్థామ—(అని మొన్నసారులు) అశ్వత్థామ యని దిద్దుకొనవలెనని

వ్రాసిరి. "నిద్రాణులఁ జంపి దొంగవలెఁ బాపసినై యిటకేగుదెంచితే— అపశబ్దము "తపసి" యనిగాని "తాపసుఁడు" అని గాని యుండును. తాపసి, తప్పు; ఊరకొనును—ఇది ప్రకృతిప్రత్యయజ్ఞానములేక వ్రాసినది; ఊరక + ఉండును; అనుదానికిపాటువచ్చినది; ఊరకొందుము— ఇది పైయజ్ఞతను స్థిరీకరించుచున్నది; మనమూరకున్నను ఈతడూరకొన్నట్లులేదు-పై-దేవునై గురువునై-యనుసంగతిని-మొదటి యనుకరణముతప్పినది. రెండవదియనుసంగతి ననునది వ్యాకరణజ్ఞానశూన్యతను దెలుపుచున్నది. కృపాచార్యులైన బోధింపకపోయె—తప్పు—ఒకరా యిద్దఱా—నిత్యైకవచనాంతముగాన 'ఒకఁడా' అనియుండవలెను. బలవశులవనిలేర —ఇది గ్రామ్యోక్తి బలవంతు, లనందగు; పినాసి—ఇది యపశబ్దము, అట్లనే—పై—పిల్చినావు—ఇది యేనుఁగు నెక్కి-నిక్కినాము జాతిలోనిది...ఇత్యాదు లెన్నో శిలిఖ్నిలో దోషము లుదాహృతములు 20—10—31 తేది సుబోధినిలో వీరి ముద్రారాక్షసము విమర్శింపఁబడినది. అందు జితకాశిశబ్దము మూఁడుచోట్ల ప్రయోగింపఁబడినది. దానికి వీరు ఒకచో జీతకాశియని సవరించియు నొకచో విస్తారజీతము నపేక్షించి యనియు, మఱియొకచో జీతమున కాసపడి యనియుఁ దెలిఁగించినారు. ఇది తప్పు. జితేన=జయేన, కాశత ఇతి జితకాశియని హేమచంద్రవ్యాఖ్యానము. ఇట్లుండ జీతమున కాశపడి, విస్తారజీతమాసించి యని వ్రాయుటంబట్టి వీరికి భాషాజ్ఞానమెంతగానున్నదో చదువరు లూహింతురుగాక!

మఱియు సీనడుమ చైత్రమాసభారతిలో శ్రీయుత వేదాల తిరువేంగళాచార్యులవారు తామొక లక్షణగ్రంథము వ్రాయుచునందు మన వేంకటశాస్త్రిగారి గ్రంథములనుండి దోషోదాహరణముగా కొన్ని పద్యము లుదాహరింపగా శాస్త్రిగారు "వెక్కిరింపఁబోయి బోల్తాపడుట" అను శీర్షికతో నొకవ్యాసము వ్రాయగా ఆచార్యులుగారు „ఆక్షేపించుటకు మీకెట్టి యధికారమునులేదు? 'పరికాస్త్రి' పదమును, „ఆబరణపుగాండ్లు" „డిల్లికి డిల్లే వల్లెకు బల్లే" అని వ్రాసిన మీరు ఈవిషయములో నోరెత్తుట కేమాత్రమును అర్హులు కార్దనువిషయము

ము మఱువకుఁడు. 'ప్రశాస్తి" అనునది సామ్రైకప్రయోజ్యమగు గ్రామ్యపదము "ఆభరణపుగాండ్లు" అనునది నిరర్థకపదము, ఢిల్లికి ఢిల్లీలేఅనునదియో పామరుల వాడుకలోనిది. ఇట్లు వ్రాసిన మీరు గూడ నితరుల నాక్షేపింపఁ బూనుట పరిహాసభాజనమగుటకే గాదా - - - ప్రకృతవిషయము సభాముఖమునన్నైనను మీరు సమర్థించుకొనవచ్చును. అప్పుడే మనతారతమ్యములు తేటపడును. ఊరక వృథాదూషణములతోఁ బనియేమి? వయోమాత్రవృద్ధులగు మీరు మావిషయములో తొందరపడుట ఇదియే మొదటిసారి కావున ఇప్పటికి ఇంకొకసారి మీకు జాగ్రత్తకై దృఢముగా హెచ్చరించుచున్నాను చేతనగుచో సభాముఖమున నిల్చి మీవాదమును నిలబెట్టుకొనుటకు ప్రయత్నింపుఁడు లేదేని యూరకుండుడు. అంతేకాని నిరర్థకముగా తిట్లు తిట్టకుఁడు. అది విద్వాంసులు, మర్యాదకలవారు సజ్జనులు నొనర్చు పనికాదు. మేము మీగ్రంథమున దోషములున్నవని నిజము చెప్పితిమి. అది సజ్జనులగువారందఱు నాదరింతురు. ఇతరులట్లుచేయరు. లోకముననున్నదేకదా నిజమాడిన నిష్ఠురము" అని యాచార్యులవారు ఢంకా మీఁద దెబ్బగొట్టి ఏదీరమ్మని చెప్పుచు నొక్కమహావ్యాసము ప్రచురించినారు. మఱియు నెందఱో యెన్నోవిధముల వీరిని వీరికవిత్వమును గర్హించుచు వచనరూపముగాఁ బద్యరూపముగావ్రాసియున్నారు. అట్టి మనమహాపండితులుగారు బ్రహ్మయ్యశాస్త్రిగారి శుశ్రూషచేయకుంటే నేనునుమీవంటి కవినేయగుదు"నని నాకవిత్వమును బరిహసించినారు. వీరికవిత్వముఁగూర్చి యెవరెట్లువ్రాసినను నేను 'నావాఁ'డను నభిమానంబుననింతవఱకెప్పుడును వారివిషయమై కలమాడింపలేదు. నేటికి దైవసంకల్ప మిట్లుండుటంజేసి రెండవపక్షమునఁ జేరవలసినవాఁడనై ప్రస్తుతమింతితో నీమొదటిభాగమును ముగించి ద్వితీయభాగమున వీరికవిత్వతత్త్వమును మూలముట్టుగ లోకమునకు విశదీకరించి కృతకృత్యుఁడ నగుచున్నానని విన్నవించుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.